# గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28-28-0

## మీరు పండించే ప్రతి పైరుకు వేయదగిన మంచి రసాయనిక ఎరువు. ఎందుచేత?

## అన్ని పైరులకు అవసరమైన ముఖ్య పోషక పదార్థాలు నత్రజని, భాస్వరామ్లములు సమ పాళ్లలో అత్యధికంగా వున్నందు మూలాన!



గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28-28-0లో నత్రజని, భాస్వరామ్లము ఎక్కువగా వున్నాయి అంటే 100 కిలోల ఎరువులో మొత్తం 56 కిలోల పోషక పదార్థాలున్నాయి. అందుచేత ఎకరా భూమిలో వేయవలసిన గ్రోమోర్ ఎరువుల మోతాదు మామూలు ఎరువులకంటే తక్కువ

గ్రోమోర్ 28-28-0 వరి, గోధుమ, చెఱకు, నూనె గింజలు, చిరు ధాన్యాలు, మిరప, కూరగాయలు మరియు అన్ని పైరులకు వేయుటకు అనువైన, పోషక పదార్థాలు ఎక్కువ నిష్పత్తిలో లభింపజేయు కాంప్లెక్సు ఎరువు ఇంతెందుకు — గ్రోమోర్ 28-28-0 వేసి ప్రతి పైరు నుంచి ఎక్కువ పంట దిగుబడి పొందవచ్చు

దీనిలోని నత్రజని అమోనియా రూపంలో లభిస్తుంది కాబట్టి పైరుకు కావలసిన నత్రజని వృధాపోకుండా పైరు తీసుకుంటుంది భాస్వరామ్లం నీటిలో కరుగుట వలన తొందరగా, తేలికగా మొక్కలు గ్రహించ గలవు ఈ విధంగా ముఖ్యమైన రెండు పోషక పదార్థాలు వృధాకాకుండా సకాలంలో లభించడంతో మీ పైరు ధృఢమైన వ్రేళ్లతో ఏపుగా పెరుగుతుంది

గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28-28-0 చిన్న చిన్న గుళ్లగా వుంటుంది అందుచేత పొలం అంతటా సమానంగా చల్లి మంచి ఫలితం పొందవచ్చు






చేనుకు
చేవ,
రైతుకు
రొక్కం —
గ్రోమోర్

వ్యవసాయ విషయములలో ఉచిత సలహాలకు, మట్టి పరీక్ష వివరాలకు యీ క్రింది చిరునామాకు వ్రాసి తెలుసుకోండి:

కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్
126, సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్-500 003




AIYARS-CF 427 TL





# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెం శంభుప్రసాద్
సంపాదకుడు
( 1938 - 1972 )

శుక్రవారం : 25-7-'75

రాక్షసనామ సం. ఆషాఢ మాస బ. విదియ

*సంపుటము : 68 సంచిక : 45*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా - రు. 33-80 పై.
ఆరుమాసాల చందా - రు. 16-90 పై.
విడి ప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
శారద, సంజీవ్‌కుమార్
(ఫొటో: శ్రీ బి. శ్యామ్‌కుమార్)



మీ
వదనమే
మీ
భాగ్యానికి
సంకేతం




మీ ముఖానికి
**కావలసిన పూర్తి సంరక్షణను యివ్వండి.**

ఆఫ్ఘన్ స్నో. పరిపూర్ణ సౌందర్య సంరక్షిణి. కుసుమ కోమలంగానూ, తుషార తుల్యంగానూ మీ చర్మాన్ని ఎల్లప్పుడూ వుంచేందుకు. ఆఫ్ఘన్ స్నోతో స్త్రీలు తమ సౌందర్యాన్ని పోషించుకొనేందుకు యిష్టపడుతారు. ఇందుకు తప్పక కారణం వుండి వుండాలి కదా!

ఆఫ్ఘన్ స్నో - సంపూర్ణ సౌందర్య సంరక్షిణి.

## మన లో మాట

ఈ వారం నుంచి ప్రారంభమైన 'రాగ వీచికలు' రాసిన శ్రీ ఆదూరి వెంకట సీతారామ మూర్తి, ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు శ్రీ ఏ. వి. సీతారామ మూర్తిగా తమ కథల ద్వారా పరిచితులే. సిందూరులో పుట్టారు. విజయనగరం, విశాఖపట్నం నగరాలలో చదువుకుని సైన్సు పట్టభద్రులైనారు.



వయస్సు 28 సం.లు ఇద్దరు మగపిల్లలు. ఉద్యోగం విశాఖపట్నం పోర్టు ట్రస్టులో. 1967లో తొలి రచన వెలుగు చూసింది. నాటి నుంచి చాలా కథలు కవితలు, రేడియో నాటికలు రాశారు. వాటిద్వారా వీరికి 'ప్రాచుర్యం' 'అనుభవం' లభించాయి. ఇంకా బొమ్మలు గీయటం, ఫొటోలు తీయటం లాంటి హాబీలున్నాయి. "రాగ వీచికలు" వీరి తొలి నవల. మా పాఠకుల ఆదరణ పొందగలదని ఆశిస్తున్నాము.

* * *

'లోకంపోకడ' కార్టూన్ సకాలంలో అందనందున వేయలేకపోతున్నాము.

# ఉత్తరాలు

### ముఖచిత్రం

"కృష్ణ" ముఖచిత్రంతో వెలిసిన (20—6—75) ఈనాటి పత్రికలో "బాహ్మకం" కథలో బొమ్మ తన మనుమరాలికి తను చెప్పినట్లు పేరు పెట్ట లేదని, ఎంతగానో ప్రేమించే కన్నకొడుకుకు దూరంగా వెళ్ళిందంటే హాస్యాస్పదంగా ఉంది.

కథలో 'రక్తం' యథార్థమునకు ప్రతిబింబం. అయితే ఇందులో ఒక చిన్న పొరపాటును దొర్లించాడు రచయిత. 'రోడ్డు కిరువైపులా చెట్లు, ఆకులు రాల్చి మగడు లేని విధవల్లా నిల్చున్నై' అన్నాడు. మగడు లేని విధవ, మగడున్న విధవని, విధవల్లో రెండు తెగలున్నాయా? ఇదెలా సంభవం?

లక్కసాని కృష్ణ, (ముర్రికుంటపల్లి.)

### సినిమా

"మహా కవి క్షేత్రయ్య" చిత్రానికి బి. రామకృష్ణ చేత పాడిస్తున్నారని మన పత్రిక ద్వారా చదివి చాలా ఆనందించాను. స్వర్గీయ ఘంటసాల గారి గొంతును కాస్తైనా గుర్తుకు తెచ్చేది యువ గాయకుడే.

బొజ్జా వెంకటేశ్వరరావు, (రాజమండ్రి.)

### హిందీ తారలు

30—5—75 తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక "యోగితాబాలి" ముఖచిత్రంతో ముగ్ధ మందారంగా వుండి మా చేతుల నందుకొన్నది. తెలుగు తారల ముఖ చిత్రాలే గాకహిందీ తారల ముఖ చిత్రాలు కూడ వేస్తున్నందుకు మీకు ప్రత్యేకాభివందనాలు.

సిరికొండ వెంకటేశం (కరీంనగర్.)

### ప్రశ్నావళి

ప్రతి వారం— వారం, కె. రామలక్ష్మిగారి జవాబులు, పాఠకులకు ఎంతో ఉత్సాహకరంగాను, ఆహ్లాదకరంగాను ఉంటున్నాయి. నేటి సమాజంలో ప్రబలుతున్న అశాశ్వతమైన రమణీయ మయిన మోజులకు అలవాటులకు అనుగుణంగా పాఠకులు ప్రశ్నలడగడము, వాటికి రామలక్ష్మిగారు కనువిప్పును కలిగించేలా జవాబుల నివ్వడము, ఎంతో సమంజసముగా, సముచితంగా ఉంది. కాని ప్రశ్నలడిగిన పాఠకులకు కఠినంగా జవాబులనివ్వడంతో, వాళ్లకు కోపము ఆగ్రహము వస్తుంది. అలా గాకుండా, పాఠకులు అటువంటి ప్రశ్నల నడగక, మంచి విజ్ఞానాన్ని ఇచ్చే ప్రశ్నలనడిగి, మంచి సమాధానాలను పొంది, నలుగురికి ఉపయోగపడే టట్లు ప్రశ్నలనడగాలని కోరుతూ మా మనవి.

మహమ్మద్ జహీరు అహమ్మదు, సికిందర్ నాయక్, ప్రసాద్, మాధవ్, పద్మాకర్, పాదరి, యల్లయ్యసెట్టి, కావలి. మహబూబ్‌నగర్ జిల్లా.

### హైదరాబాద్ నోట్‌బుక్

మీ (మా) పత్రికలో ముఖ్యంగా . . . "హైదరాబాద్ నోట్ బుక్" నిర్వహిస్తున్న 'శ్రీ తిరుమల రామచంద్ర' గారు అభినందనీయులు. పిన్నటికప్పుడు రాజధానిలోని రాజకీయ విజ్ఞాన విషయాలూ, వాటితోపాటు "ఉపశ్రుతి" పేరుతో చక్కటి హాస్య సంభాషణలు మాకు అందిస్తున్నారు.

"శ్రీ కుమార్" (కడప)

### కార్టూన్లు

కార్టూనులు పంపేవారు అవి మీరు వేసుకోక పోతే తిరిగి తీసుకోవాలంటే ఏమి చేయాలి?

జి. పవన్‌కుమార్ (ఆగ్రా)

[స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్లలంటించిన కవరు కార్టూన్లతోపాటు జతపరచాలి. — సం.]

# ఫాలాక్షుని డైరీ

### ప్రేమ — హత్య ! ?

కర్ణాటక రాజ్యానికి చెందిన శ్రీరంగపట్టణం తాలూకాలోని ఓ గ్రామంలో 24 ఏళ్ల వెంకటయ్య అనే ఓ యువకుడు 16 ఏళ్ళ హొంబాలమ్మను ప్రేమించి, ప్రేమింప చేసుకున్నాడట. ఫలితంగా హొంబాలమ్మ గర్భవతి అయ్యిందట. ఈ విషయం ఆమె తలిదండ్రులు తెలుసుకుని ఆ వెంకటయ్యను తమ కూతుర్ని పెళ్ళి చేసుకోమని అడిగేసరికి వెంటనే అతను ఒప్పేసుకున్నాడట. దాంతో ముహూర్తం కూడా పెట్టేశాక ఓ నాడతను ఆ హొంబాలమ్మను తీసుకుని నది ఒడ్డుకు వెళ్లి గమ్మునామెను నదిలో తోసి, చేతులు దులుపుకునొచ్చేశాడట. శవం దొరికాక, హొంబాలమ్మ తల్లిదండ్రుల ఫిర్యాదుపై పోలీసు ఆ వెంకటయ్యను అరెస్టు చేసినట్టే చేసి వదలిపెట్టేశారట. ఈ విషయంలో ఇనస్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు కలుగచేసుకున్నారట. ఫలితంగా ఈ కేసుకు సంబంధించిన ఆ వూరి సర్కిలిన్‌స్పెక్టరు పుట్టేశయ్యను, సబిన్‌స్పెక్టర్ చిలువాడిని, అసిస్టెంటు సబిన్‌స్పెక్టరు క్రిష్ణస్వామిని, మక్బూల్ అనే హెడ్ కానిస్టేబుల్ని పని లోంచి సస్పెండు చేశారట పోలీసు సూపరింటెండెంట్. ఇంతకూ ఆ హంతకుడు పరారయ్యాడట.

### విద్యుత్తుకు ఆకారమా ! ?

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్ర విజ్ఞానులు మొట్ట మొదటసారిగా (ప్రపంచ చరిత్రలోనేనట) విద్యుత్తుకు ఫొటో తీశారట. ఈ విద్యుత్తు నీటి బిందువు వంటి ఆకారంతో వుందట.

### మద్రాసులో పాకలు

మద్రాసు (తమిళనాడు)లో ముగ్గురిలో ఒకడు పాకలలో నివసించేవాడేనని ఆ ప్రభుత్వం లెక్కలు వేసిందట. 24.69 లక్షల జనాభా వున్న మద్రాసులో 7,37,531 మంది రోడ్డు ప్రక్కన గుడిసెలలో వుండే వారేనని, మద్రాసులో 1202 ఆ రకం పాకలున్న ప్రదేశాలున్నాయని కూడా ఆ ప్రభుత్వం ప్రకటించిందట

### మరణం తెచ్చిన ఆభరణాలు

ఆదోని మదిరగిరికి చెందిన మదిరె తిమ్మక్క అనే ఆవిడను 20 వ తేదీ రాత్రి 12.30కు ఎవరో హత్య చేసి, ఆమె శవాన్ని ఆమె పాకవెనుకు లాక్కుపోయి, వంటి మీద నగానట్రా ఒలుచుకు పోయారట. వారు దొంగిలించిన సొమ్ము విలువ 250 రూపాయలేనట. స్త్రీలకు అందమే గాక, ఆభరణాలు కూడా శత్రువులే కదా !

*"మగ పెళ్లివారి విడిదిలో దొంగతనం జరిగిందన్న విషయం, అది పెళ్లి వారికి తెలిస్తే ఎంత బాధపడతారు! ఈ వార్త ఎలాగైనా మనలోనే వుండిపోవాలి." అని మా వియ్యంకుడు చంద్రం గారు, విడిదిలో వున్న మా మగ పెళ్లి వారందరితోనూ అన్నారు.*

విడిదిలోకి దిగి సరిగ్గా రెండు గంట లయిందో లేదో, చంద్రంగారి తమ్ముడి భార్య, తన డబ్బు అయిదువందలు పోయిం దని పెద్ద దుమారం లేవదీసింది.

ఆవిడ చేసిన గోల చూస్తే, నాకు, అసలు ఈ పెళ్లి కెందుకు వచ్చానా! అని బాధేసింది.

-- పెళ్లి మా వియ్యంకుడి రెండవ అబ్బాయిది వాళ్ల పెద్దబ్బాయి పెళ్లికెలాగా రాలేదని, ఈ పెళ్లికైనా రావాలని ఆయన పట్టుబడ్తే, బాగుండదని నేనూ మా శ్రీమతి బయల్దేరాం.

అసలు ఈ పెళ్లికి బయల్దేరాలని గట్టి పట్టు మా శ్రీమతిదే. "ఎప్పుడూ మీ ప్రయివేట్లూ, పిల్లలూయేనా? కాస్త నాలుగు ఊళ్ళు చూడడం, ఏడాదికో సారయినా ఏ పెళ్లికో, పేరంటానికో వెళ్లి, నలుగురు బంధువుల్ని చూడడం అదీ ఏమీలేదా?" అంటూ సాధించి నాచేత సరేననిపించింది. మా విజయనగరం నుండి బెజవాడ వెళ్లడం ఒక రకంగా దూరపు ప్రయాణమే.

ఏడాది పొడగునా పిల్లల ముందు వాగి వాగి అలసిపోయే నా స్కూలు మాస్టరు జీవితంలో వేసంకాలపు సెలవలలో కూడా విశ్రాంతి లేదు. ఎందుకంటే ఆ రోజుల్లో స్కూలు లేకపోయినా, ప్రయివేట్లుంటాయి. అవి లేకుండా సంసారం గడపగల ఆర్థిక స్తోమతు నాకు లేదు.

కాని వేసవి కాలంలో ఎక్కడికైనా వెళ్లాలని, పిల్లలూ, శ్రీమతీ, పట్టుపట్టడం సహజమే. మూడేళ్ల నుండీ వాళ్ల కోరికను కాదంటున్నా, ఈఏడు కదలక తప్పలేదు.

ప్రయాణం చాలవరకూ సాఫీగానే జరిగింది. నేనూ, మా శ్రీమతీ, అమ్మాయి సరళ, రెండో అబ్బాయి గిరి బయల్దేరాం.

విశాఖ పట్నంలో ఒకాయన ఎక్కాడు. ఆయన కబుర్లతో నాకు బోలెడు కాలక్షేప మయింది. మా వాళ్లు, రైలు కుదుపుకి నిద్రాదేవి వడిలోకి ఒరిగారు. నాకూ, ఆయ నకూ నిద్రపట్టలేదు. ఇద్దరం ఎదురెదురుగా కూర్చున్నాం.

ఆయన పేరు అప్పారావుగారు. వయస్సు సలభై వుంటుంది. ఒక పెద్ద కంపెనీలో సేల్సుమాన్‌ట. నల్లగా, బొద్దుగా పొడుగ్గా వున్నాడు. మేం పెళ్లికెళ్తున్నాం అని చెప్పగానే "ఏం పెళ్లిళ్లండి!" అని పెదవి విరిచాడు.

పెళ్లి పేరు వినగానే విషాదంగా మొహం పెట్టిన తీరు చూస్తే. ఆయనకి పెళ్లి అంటే ట్రాజెడీతో సమానం కాబోలు, అని పించింది.

ఆయన తీరిగ్గా సిగరెట్టు వెలిగించి, గుప్పు గుప్పుమని పొగతోపాటు తన అభిప్రాయాల్ని పైకి వదలసాగాడు.

"అసలు, మధ్యతరగతి ఆడపిల్లల తండ్రులు పెళ్లిళ్ల విషయం మర్చిపోతే మంచిది. మా మేన కోడళ్లిద్దరికి పద్దెనిమిదో ఏడు వచ్చిన దగ్గర్నుంచీ ప్రయత్నం చేస్తున్నాం. ఇప్పుడు ముప్ఫైయ్యవ పడిలో పడ్డారు, కానీ పెళ్లి కాలేదు. ఎందుచేత నంటారు?"

నేను ఆలోచించి, ఏదైనా అందామను కున్నాను.

కానీ నేనేమీ అనకుండానే, "వాళ్లకు అందంలో గాని, చదువులోగాని, ఏ లోపమూ లేదు. కట్నం పదివేల వరకూ ఇవ్వడానికి సిద్ధంగా వున్నాం" అంటూ ఆయనే సంభాషణ కొనసాగించాడు "కానీ పెళ్లి కొడుకుల తండ్రులు ఎంత కఠినంగా వుంటున్నారో చెప్తాను వినండి ఒకాయన—ఆయన మరెవరో కాదు, మా హైస్కూలు టీచరే ఆయన కొడుకుకి మాట్లాడదామని వెళ్తే, పదిహేను వేలు కట్నమూ, లాంఛనాలు వేరే యివ్వ గలిగితే లోపలికి రమ్మన్నాడు; లేకపోతే బయటకు నడవమన్నాడు. నేను తెల



బోయాను. ఆయన నాకు తెలిసినవాడే గనుక, 'ఏమిటి మాష్టారూ! మీరే అలా అంటే ఎలా?' అన్నాను. దానికాయన, 'ఏం చెయ్యమంటావు అప్పారావూ. నా సంగతి నీకు తెలియనిదికాదు. నాకున్నదంతా ఖర్చుపెట్టి మావాడికి చదువు చెప్పించాను. ఇపుడు నా భవిష్యత్తేమిటి? ఏదో ఈ కట్నం డబ్బులువస్తే, అది బాంకులో వేసుకుని. వడ్డీని వాడుకోవాలని తాపత్రయం! అన్నాడు. ఆయన బాధ నర్థంచేసుకుని, అది తీర్చడం చాతకాక తిరిగొచ్చాను.''

అలాటి సంఘటనలు ఎన్నో విన్న, నాకు అది విడ్డూరమనిపించలేదు. ''కట్నాల బెడద విపరీతంగానే వుంది.'' అన్నాను.

''అదేనండీ! ఇలావుంటే ఇంకొన్నాళ్ళకి సమాజం ఏమవుతుంది? ధరలు చూస్తే ఆకాశాన్నంటుతున్నాయి. మగపిల్లలకు పెద్ద చదువులు చెప్పించడం పెద్ద దండుగ! చదువుకు తగిన వుద్యోగాలేవీ? ఇటు కూలీ వాడైనా ఫరవాలేదు, అటు బాగా డబ్బున్న వాడైనా ఫరవాలేదు. మధ్యతరగతి వాడిపని మాత్రం నరకయాతనగా వుంది.''

నిరుద్యోగ సమస్యా, ధరల పరిస్థితీ, మొదలైనా విషయాలెన్నిటి మీదో మా మధ్య చర్చ కొనసాగింది.

కబుర్లలో అనకాపల్లీ, సామర్లకోటా, రాజమండ్రీ మొదలైన స్టేషన్లు శీఘ్రగా గతించాయి. ఆయన సంభాషణ, తిరిగి మళ్లీ కట్నాలమీదకే రాసాగింది. వేరు వేరు ఉద్యోగాలలో వున్న కుర్రాళ్ల ధరవరలు వివరంగా చెప్పాడు. బాంకులో పనిచేసే కుర్రాడి రేటెంతో, యల్లైసీ గుమస్తా రేటెంతో ఇతర వుద్యోగస్తుల రేట్లెలా వున్నాయో వివరాలు చెప్పాడు. ఇంజనీర్లూ, డాక్టర్లూ మన కందుబాటులో లేరన్నాడు. అయినా ఇంజనీర్కను పిల్లనివ్వద్దని నాకు సలహా కూడా ఇచ్చాడు. ''పిల్లతో కూడా అల్లుణ్ణి మనమెక్కడ భరించగలం?'' అన్నాడు.

ఏలూరులో ఆయన దిగిపోయాడు. మేమూ కాఫీ ఫలహారాల సందడిలో పడ్డాం.

బెజవాడ వచ్చేవరకూ మేమూ వెళ్లబోతున్న పెళ్లి గురించే, నేనూ శ్రీమతే మాట్లాడుకున్నాం.

పెళ్లికూతురు చాలా అదృష్టవంతురాలు. మా చంద్రంగారి రెండో అబ్బాయికి బ్యాంకులోనే పని. అయినా, కట్నం చాలా తక్కువ. అంతేకాక పెళ్లికూతురి తండ్రికి కాన్సర్ వ్యాధి. ఆయన చావుబతుకుల్లో వున్నాడు. పెద్ద స్థితిమంతుడేమీ కాదు.

ఆయన కూతుర్ని. తన కోడలిగా చేసుకుంటానని రిటైర్డు ఇంజనీరయిన చంద్రంగారు మాట ఇవ్వడం వలన, కట్నం తక్కువైనా, లాంఛనాలేమీ జరుపకపోయినా, పెళ్లి జరిపించడానికి నిర్ణయించారు.

అందరూ, చంద్రంగారి లాంటి సహృదయులు ఉండరు కదా. ఎవరిదాకానో ఎందుకూ? ఆయన తమ్ముడు జగన్నాథ్ గారూ, మరదలు శాంతీ, ఈ పెళ్లి జరగకూడదని ఎంతో ప్రయత్నం చేశారు. కాని కుదరలేదు.

పెళ్లిలో ఏమైనా తగువులొస్తే అది జగన్నాథ్‌గారి వలననే-అని కూడా నేనూ, శ్రీమతి అనుకున్నాం.

బెజవాడ స్టేషనులో చంద్రంగారు కన్పించారు. ఆయన కూతుర్ని, అయిదేళ్ల క్రితమే మా కోడలుగా చేసుకున్నాం. అందువలన, మేమంటే ఆయనకు, ప్రేమా, గౌరవమూ కూడాను.

సరాసరి మమ్మల్ని మగపెళ్లివారి విడిదికి తీసుకువెళ్లారు. అదొక పెద్ద హాలు. అందరి సామాన్లూ అందులోనే పెట్టుకున్నాం.

జగన్నాథ్ దంపతులు కూడా అప్పుడే వచ్చారు. వారి సామాన్ల ప్రక్కనే మా సామాన్లు వున్నాయి. సుమారు ఇరవైమంది దాకా మగవారూ, ఆడవారూ వున్నాము.

ప్రొద్దున్న ఏడుగంటలకు రైలు దిగడం వలన విడిదికి రాగానే రెండోసారి కాఫీ త్రాగి, స్నానాదికాలు ప్రారంభించాం. అందరికీ ఆడపెళ్లివారు ఉప్మా, కాఫీ పంపారు. ఆ వుప్మాలో జీడిపప్పు తక్కువైందని జగన్నాథ్‌గారు విమర్శించి, అలుగుదామా? వద్దా? అని భార్యతో సంప్రదించి, చివరకు చంద్రంగారు వేరే హోటలు నుంచి తెప్పించిన పెసరట్లతో ఆ వుప్మాను జోడించి తిని సంతృప్తిపడ్డారు.

స్వభావాలనే కాక రూపు రేఖలలో కూడా అన్నదమ్ములిద్దరికీ చాలా తేడా వుంది. చంద్రంగారు పచ్చగా, పుష్టిగా వున్న అరవైఏళ్ల పెద్దమనిషి. జగన్నాథ్‌గారు, నల్లగా, స్ఫోటకం మచ్చలమొహంతో వుండే నలభై అయిదేళ్ల వ్యక్తి. ఆయన భార్య




ఎప్పుడూ సినిమాస్టారులా వుండాలని ప్రయత్నిస్తుంది. ఆమెకూ నలభైపైబడినా, తను తలవెంట్రుకలకు నల్లరంగు వేసుకుని మొఖానికి బోలెడంత పౌడరేసుకుని, ఎప్పుడూ పల్చని చీరలు ధరిస్తూ వన్నెల విసనకర్రలా వుంటుంది.

మేమూ స్నానాలుచేసి బట్టలు ధరించి, ఊళ్లోకి వెళ్లడానికి సిద్ధమవుతున్నాం, ఇంతలో జగన్నాథ్‌గారి భార్య, ''అయ్యో నా డబ్బు! పోయింది! పోయింది.'' అంటూ అరవనారంభించింది. అప్పుడు ఆ హాలులో వున్నవాళ్లందరమూ మగపెళ్లివారమే.

''ఏమిటి? ఏమిటి?'' అని ఆమె చుట్టూ, ఆడవాళ్లు మూగారు నేనూ, చంద్రంగారూ విస్తుపోయి నించున్నాం.

''పర్సులో పెట్టిన డబ్బు ఎవరో కాజేశారు. అయిదు వచ్చనోట్లు! మా దగ్గరున్న డబ్బంతా అదే. మాకిప్పుడేందారి!'' అంటూ జగన్నాథ్‌గారు వాపోయారు.

అసలేం జరిగిందని చంద్రంగారు అడగ్గా శాంతి చెప్పింది. తను పర్సులో డబ్బుపెట్టి, ఆ పర్సు తన బెడ్డింగు మీదపెట్టి బాత్‌రూముకి వెళ్లిందట. తిరిగివచ్చి చూస్తే పర్సు ఉందిట కాని, డబ్బులేదట

ఎవరో ఈ హాలులో వాళ్లే తీసి వుంటారంది. పెళ్లికొచ్చినవాళ్లందరి మనసులూ కలుక్కుమన్నాయి.

''ఒకవేళ పెట్లో పెట్టావేమో చూడు'' అని చంద్రంగారి భార్యఅంటే శాంతి, తన పెట్టీ, బెడ్డింగు అన్నీ చూశాననీ డబ్బులేదనీ అంది

డబ్బు పోయిందని ఆవిడ బాధపడుతోందా, లేక ఇతరులమీద అబాండం వెయ్యాలని కోరుతోందా? అని నాకనుమానం కలిగింది. ఆమె ఎంతసేపూ ''ఈ పల్లో

వాళ్లే తీసారు, పైవాళ్లెవరూ రాలేదు. అందరి సామాన్లూ తణిఖీ చెయ్యండి" అంటోంది.

ఆ మాటలకు అందరూ ఎంతో నొచ్చుకున్నారు. వెంటనే ఒకొక్కరూ తమ సామాన్లు తీసి చూబించబోయారు.

కాని చంద్రగారు, అందర్నీ వారించి, శాంతిని ఊరడించి తను తీరికగా, ఆ సంగతి కనుక్కుంటానని హామీ యిచ్చారు. ప్రస్తుతానికి ఏమీ గొడవ చెయ్యవద్దనీ, ముఖ్యంగా ఆడపెళ్లి వారి కీసంగతి తెలియ నియ్యవద్దనీ, మమ్మల్నందర్నీ మరీ మరీ బతిమాలారు.

ఆ సమయంలో శాంతి యొక్క ఏకైక పుత్రుడు, అయిదేళ్లవాడు, బుజ్జి, "అమ్మా చాకొలెట్లు కొను"అని గొడవ చెయ్యసాగాడు. ఆ మాటకి శాంతి, పిల్లడికి చాకలెట్లు కొన డానికి కూడా తన దగ్గర డబ్బులేదని అంది.

బుజ్జిగాడు సిసింద్రీలాటి వాడు. "పెట్లో డబ్బుంది తియ్యమని గొడవ చేసాడు. "పెట్లో లేదురా. ఎవరో నా పర్సులోది కొట్టేశారురా" అని ఆవిడ నా వంక చూసింది.

నాకు వళ్లంతా తేళ్లూ, జెర్రులూ పాకి నట్లైంది.

ఇంతలో ఆడపెళ్లివారు, పానకపు బిందెలు తేవడంతో. అందరి దృష్టి మరో వైపు మళ్లింది.

పెళ్లి ఆ మరునటి రోజు ప్రొద్దున్న.

ఆ రోజు జరిగే తతంగాలలో పాల్గొనే ముందు, రాకరాక బెజవాడ వచ్చాను కాబట్టి, నా ముఖ్య స్నేహితుడైన కామరాజును ఒకసారి కలియాలని బయల్దేరాను.

దారి పొడుగునా శాంతి యొక్క దుస్స్వభావమే నన్ను కలిచింది. ఒక వేళ నిజంగా డబ్బు పోయినా, అటువంటి మాటలనడానికి ఎంతమందికి నోరు వస్తుంది? వీళ్లందర్నీ అవమానపరిచి తను నిజంగా దొంగను పట్టుకోగలదా? అటువంటి పరిస్థితులలో ఆడపెళ్ళివారేం చేస్తారనుకుంది. తమ పరువు ప్రతిష్ఠలు కాపాడుకోవడానికి ఆ డబ్బు ఇవ్వనూవచ్చు. లేదా ఊరుకోనూవచ్చు. కాని, మాట శాశ్వతంగా వుండిపోతుందని అందరికీ బాధేకదా. పైగా తమ దగ్గరున్న డబ్బంతా అదేననీ, అది తప్ప పిల్లడికి చాకొలెట్లు కొనడానికి కూడా తమవద్ద డబ్బులేదన్నారే, దాని అంతరార్థ మేమిటి. ఇలా ఆలోచించిన కొద్దీ వాళ్లు కావాలనే ఈనాటకం ఆడుతున్నారేమో ననిపించింది. ఆ సమయంలో నిజా నిజాలు తేల్చడం చాలాకష్టం.

ఆలోచనలో కొంచెం ఎక్కువ దూరం పోయినా, మొత్తానికి కామరాజు యొక్క యిల్లు సులభంగానే కనుక్కున్నాడు. కామరాజు నాకన్న వయస్సులో చాలా చిన్న వాడు. మూడు పదులు నిండని వాడు. నా స్టూడెంటూ, ఆత్మీయుడూ.

నన్ను చూసి పరమానంద భరితుడయ్యాడు. "ఎన్నాళ్లయింది మేష్టారూ, మనం కల్సుకుని !" అని కౌగిలించుకున్నంత పని చేశాడు.

"అవునోయ్! ఏమిటి ఈ హిప్పీ అవతారం దాల్చావేమిటి? అయినా నీలాంటివాళ్లు హిప్పీ వేషంలో కూడా అందంగానే వుంటారులే." అన్నాను, కుర్చీలో కూర్చుంటూ.

"అదికాదు మాష్టారూ తిరుపతి మొక్కుకు కొత్త రూపం అనుకోండి." అన్నాడు. ఇద్దరం నవ్వుకున్నాం.

అతను కాలేజీ డ్రామాలలో వేషాలు వేస్తాడు. ఆడవేషాలు వేసేవాడు. పాతకాలపు కబుర్లు చెప్పుకున్నాం. అప్పటి సంఘటనలు కొన్ని నెమరు వేసుకున్నాం.

నేను అతనితో, చెబుదామా, వద్దా అనుకున్నా, తరువాత అతనిలాటి ఆత్మీయుడితో చెప్పుకోవడంలో తప్పులేదని, ఆరోజు ప్రొద్దున్న విడిదిలో జరిగిన సంఘటన చెప్పాను. అది విని అతను చాలా నొచ్చుకున్నాడు.

"అసలంత అజాగ్రత్తగా వుండనే కూడదు. ఉన్నతరువాత పోతే, వాళ్ల దురదృష్టమని ఊరుకోవాలి. విడిదిలోని వాళ్లు మంచివాళ్లు కాబట్టి సరిపోయింది. అందులో ఎవరైనా 'అలా అంటావా?' అని ఎదురు తిరిగితే ఏమయ్యేది"

"చంద్రంగారి మొహంచూసి అంతా వూరుకున్నారు. ఆవిడ ఎంత రభసకైనా సిద్ధపడింది." అన్నాను, నేను.

"అసలంత డబ్బు ఆవిడవద్ద వుందా?"

"అదే తమాషా! అంతకు అరగంట క్రితమే ఆమె, అందరికీ కన్పించేటట్లు అయిదు వచ్చ నోట్లు లెక్కబెట్టి పర్సులో పెట్టింది. కాబట్టే అంత డబ్బూ పోయిందంటే అందరూ నమ్మారు."

"ఆఁ!" అని ఆశ్చర్యపోయి, కొంచెం ఆలోచించి, అయితే ఆ డబ్బు పోయివుండదు, మాష్టారూ!" అన్నాడు.

"నాకూ అలానే అనిపిస్తోంది కాని, ఏం చేస్తాం?" అని అతనితో ఇతర విషయాలు ముచ్చటించాను. అతని సానుభూతి నా హృదయాన్ని తేలిక పరిచింది. దాదాపు అరగంట అతనితో గడిపాను.

విడిదిలో కొన్ని కార్యక్రమాలకు హాజరు కావలసి వుండడం వలన, వెంటనే తిరుగు ముఖం పట్టా, సాయంకాలం విడిదికి రమ్మని కామరాజు నాహ్వానించాను.

తను తప్పకుండా వస్తానని అతను మాటిచ్చాడు.

మధ్యాహ్నం భోజనాల సమయంలో చాలా మంది బంధువులను కలుసుకోవడం జరిగింది. సరదాగా కాలం గడిచింది

రాత్రి ప్రయాణపు బడలికవలన, మధ్యాహ్న భోజనానంతరం, విడిదికి చేరుకోగానే, నిద్ర ముంచుకువచ్చింది. విడిదిలో, నేలమీదే బెడ్డింగు పరుచుకుని పడుకున్నాను.

నిద్రనుంచి మేల్కొనేసరికి సాయంకాలం అయిదున్నర అయింది. విడిదిలో అంతా హడావుడిగా వున్నారు అంతా ఆడపెళ్లి వారింటికి వెళ్ళడానికి ముస్తాబవుతున్నారు.

నా ప్రక్కనే చాపమీద కూచుని శ్రీమతీ, కామరాజూ కబుర్లు చెప్పుకుంటున్నారు. నన్నుచూసి, "నిద్ర అయిందా మాష్టారూ?" అని కామరాజు అడిగాడు.

అతనికి, "అయింది" అని జవాబిస్తూండగా నన్ను ఎవరో కుర్రాడు, "పది పైసలు ఇయ్యి" అని అడిగినట్లయింది.

ఎవరా? అని చూస్తే, బుజ్జిగాడు! నాప్రక్క నిలబడ్డాడు.

నేను, "ఏమిటిది?" అన్నట్లు మా శ్రీమతివైపు చూశాను. "వాళమ్మదగ్గర డబ్బు లేదుగా. అందుకని అందరివద్దా, చాకలెట్లుకోసం డబ్బులడుగుతున్నాడు."

"ఓహో! అలాగా!" అని నేను డబ్బులు తీసివ్వబోతుంటే, కామరాజు వాణ్ణి దగ్గరకు తీసి, తను డబ్బులిచ్చాడు.

పైగా వాడితో, "ఒరే బుజ్జీ! నీకు డబ్బులు కావాలంటే నన్నే అడుగు ఎవర్నీ అడగకు." అని చెప్పాడు. వాడా డబ్బులు తీసుకుని పరిగెత్తాడు. నేను ప్రశ్నార్థకంగా కామరాజువైపు చూశాను.

"నాకు చిన్నపిల్లలంటే చాలా యిష్టం మాష్టారూ" అన్నాడు.

విడిదిలోని ఆడవాళ్లంతా ముస్తాబై బయటికి వెళ్తున్నారు. శాంతికూడా టెంగు రంగామని ఫారిన్ నైలక్సుచీర కట్టుకుని బయల్దేరింది.

జగన్నాధ్‌గారు మాత్రం గాఢంగా నిద్రలో మునిగి, గురకొడుతున్నారు. ఆయనవైపు చూసి, లాభంలేదనుకుని శాంతి ఆడవారితో బయటికి వెళ్లిపోయింది.

నేనూ, కామరాజూ నిద్రపోతున్న జగన్నాధ్ తప్ప విడిదిలో మరెవరూ లేరు. మరో పావుగంట మాట్లాడుకున్నాక కామరాజు "అలా బయటికి వెళ్దాం పదండి మాష్టారూ" అన్నాడు.

ఈ పావుగంటలోనూ బుజ్జిగాడు రెండుసార్లు కామరాజువద్దకు రావడమూ, డబ్బులు



నువ్వు ఎలా వుంటావో కూడా తెలీదే నిన్నెలా పెళ్ళిచేసుకోను బావా?!

వసూలు చేసుకుని వెళ్లడమూ జరిగింది. కామరాజు వాణ్ణి మరీ ముద్దు చేస్తున్నాడనిపించింది.

నేను మొహం కడుక్కువస్తానని లేచి పెరట్లోకి వెళ్లాను.

సబ్బు మర్చిపోవడంవలన, పెరట్లోంచి మళ్లీ ఒకసారి హాలులోకి వచ్చినప్పుడు కామరాజు, బుజ్జిగాణ్ణి ఒళ్లో కూచోపెట్టుకుని ఏదో చెప్తున్నాడు. నేను అది అంతగా పట్టించుకోక మళ్లీ పెరట్లో కెళ్లిపోయాను.

తరువాత పది నిముషాలకు నేను పెరట్లోంచి వచ్చేసరికి, బుజ్జిగాడు వాళ్ల నాన్నని లేపుతున్నాడు. ఆయన ఎంతసేపటికి లేవలేదు.

నేనూ, కామరాజూ ప్రకాశం బారేజిదాకా వెళ్లి సుమారు గంటన్నర తరువాత తిరిగి వచ్చాం.

ఒకరకంగా పెళ్లికి రావడం, చాలా కాలం తరువాత కామరాజును కలుసుకోవడం ఆనందదాయకంగా వున్నా ప్రొద్దుటి సంఘటన నా మనసుని ముల్లులా బాధిస్తూనే వుంది.

మేము విడిదికి తిరిగి వచ్చే సరికి విడిది అంతా గందరగోళంగా వుంది. అందరూ ఏవేవో మాటలంటున్నారు.

శాంతి, ఏడుస్తూ, "ఈ సారి నిజంగానే డబ్బు పోయిందర్రోయ్!" అంటోంది.

"అదేమిటమ్మా, ప్రొద్దున్న పోవడం నిజంకాదా?" అని ఒకరు, "అయితే యిప్పుడు మాత్రం పోయిందో లేదో?" అని మరొకరూ. "మమ్మల్ని అనవసరంగా మాటలన్నావ్, అందుకు తగిన శాస్తియింది" అని ఇంకొకరూ అన్నారు.

"నా బిడ్డసాక్షిగా చెప్తున్నాను నిజంగా పోయింది"

"ప్రొద్దున్న పోలేదా?"

"లేదు."

"మరి పోయిందన్నావు ఎందుకు?" అని, అంతా శాంతిని నానా మాటలూ అంటున్నారు.

మా శ్రీమతి అసలు విషయం చెప్పింది. ప్రొద్దున్న డబ్బుపోవడం అబద్ధమనీ, డబ్బు కక్కూర్తి కొద్దీ అలా చెప్పానని శాంతి ఒప్పుకుందనీ, ఈ సారి నిజంగా పోయిందనీ చెప్పింది శాంతి ఆడ పెళ్లివారింట్లో వుండగా, బుజ్జిగాడు, "నాన్న పెట్టెతాళాలిమ్మంటున్నార"ని అడిగితే ఇచ్చిందట.

ఆ తాళాలతో పెట్టెతీసి, తనకు కావలసిన డబ్బులు చాకలెట్ల కోసం తీసుకుని, తాళం వెయ్యకుండా బయటికి వెళ్లి పిల్లలతో ఆడుకుంటున్నాడట.

కొంచెం సేపటికి తిరిగి వచ్చిన శాంతికీ, తాళంలేని పెట్టె కనిపించిందట తీరాచూస్తే అందులో డబ్బు మాయమైందిట.

చంద్రంగారు, మరదల్ని "అయితే, ప్రొద్దున్న డబ్బు పోకుండానే పోయిందని నాటకం ఆడావన్నమాట!" అని క్రోధంతో గద్దించారు

"పొరపాటయింది ఈ సారి నిజంగా పోయింది, వాకబు చెయ్యండి" అంది

తన తమ్ముడు కూడా మరదలితో చెయ్యి

కలిపినందుకు, అతనిని నానాచివాట్లూ పెట్టారు.

"అన్నయ్యా దాని మాట విని, పొరబాటు చేశాను, ఇప్పుడు నిజంగానే పోయింది." అని జగన్నాథ్ ఏడుపు మొహం పెట్టాడు.

"ఏమండి ఇప్పుడేం చెయ్యాలి." అని శాంతి ఏడుపు హెచ్చించేసరికి. చంద్రగారికి చిరాకేసింది.

"ముందు నోరుముయ్యి." అన్నారు. "తరువాత అందరికీ వరుసగా క్షమాపణ చెప్పుకో. ఇంక ఎప్పుడూ ఇలాంటి పనులు చెయ్యనని లెంపలు వేసుకో. అప్పుడు, నిజంగా నీకు బుద్ధి చెప్పడానికే గనుక ఎవరైనా ఇటువంటి పని చేసుంటే, వాళ్లకు దయ గలిగి ఇస్తారు. లేకపోతే నీ ఖర్మ!" అని చంద్రంగారంటే, ముందు తటపటాయించినా, తరువాత ఇక తప్పనిదని శాంతీ జగన్నాథ్‌లు గ్రహించారు.

ఇద్దరూ, ప్రతివారి వద్దకూ వచ్చి

## పెళ్ళి

క్షమాపణ అడిగారు. లెంపలు వేసుకున్నారు.

ఒక నిముషం అంతా మౌనంగా వున్నారు.

చంద్రంగారు అందరివైపూ చూశారు. అందరూ ఆయనవైపు చూశారు.

ఆ సమయంలో కామరాజు తన జేబులోంచి ఒక కవరు తీసి, "ఇదుగో మీ డబ్బు:" అన్నాడు.

అందరూ ఒక్కసారి ఆశ్చర్యపోయారు.

"విడిదిలోని వారంతా ఎంత పెద్ద మనుష్యులంటే మీరు వాళ్లమీద చేసిన తప్పు ఆరోపణను అనవసరంగా సహించారు గాని, ఎదురు తిరిగి మిమ్మల్ని, మీ సామాను చూపించమని అడగలేకపోయారు. సమాజంలో నూటికి తొంభైఅయిదు మంది ఇలాంటి దౌర్బల్యమే పీడుస్తూండడం వలన అవినీతి హాయిగా రాజ్యం ఏలుతోంది కాని అసలు నిజం తెలుసుకున్ననాడు, చంద్రంగారిలా ఎవరైనా పెద్దలే ఈ సమాజాన్ని రక్షిస్తారనే ఆశతో ఈ డబ్బు ఇస్తున్నాను."

"కామరాజా! నువ్వా!" అన్నాను. నిర్ఘాంతపోయి.

"అవును మాష్టారూ! మిమ్మల్ని ఆమె అవమానించిందని విని నేనెంతో బాధపడ్డాను. నిజాన్ని బయటపెట్టాలని నిశ్చయించుకున్నాను. బుజ్జిగాడిని చాకొలెట్లతో లొంగదీసుకుని, డబ్బు వాడిచేతే తీయించాను నేను చేసింది తప్పయితే నన్ను క్షమించండి" అన్నాడు.

చంద్రంగారు ఆనందం పట్టలేక వచ్చి, అతని చేతులు పట్టుకుని, "ఘటికుడివే!" అన్నారు.

నేను, "నువ్వు నా స్టూడెంటువనీ, ఆత్మీయుడవనీ గర్విస్తున్నాను!" అని అతనిని కౌగిలించుకున్నాను.

మర్నాడు పెళ్లి ఘనంగా జరిగిపోయింది.




*(గత సంచిక తరువాయి)*

"ఏమిటీ కమ్మని వాసనా, గుఫీమనే తాలింపూ, హాస్పటల్‌లోకి కూడా వచ్చి గదులన్నీ చుట్టబెట్టేస్తోంది?" అంటూ హాస్పటల్‌కీ ఇంటికి మధ్యనున్న అద్దం తలుపు తెరుచుకొని హాల్లోకి వచ్చాడు ప్రభాకరం.

"అది ఉషచేతి తాలింపు కమ్మదనంరా... మరి చూశావా నిన్న ఏదో అన్నావు?" అంది జోగమ్మ, ముఖంలో ఒక రకమైన సంతృప్తీ, గర్వం వ్యక్తం అవుతూంటే...

"అత్తయ్యా... అదిగో పప్పూ, కూరా, పచ్చడీ, పులుసూ అన్నీ టేబుల్ మీద పెట్టాను. అన్నం మాత్రం స్టౌమీదే ఉంచాను, వెచ్చగా ఉంటుందని... ఎప్పుడు కావలిస్తే అప్పుడు పెట్టుకుని తినొచ్చు మీరు... మరి నేను వెళతాను" అంటూ టవల్‌తో చేతులు తుడుచుకుంటూ హాల్లోకి ప్రవేశించిన ఉషని అభినందన పూర్వకంగా చూశాడు ప్రభాకరం...

"నువ్వుకూడా ఇక్కడే తిందువుగాని ఉండు" అంటూ జోగమ్మ చెబుతున్నా వినకుండా "నేనిక్కడ తిని ఉండిపోతే ఎలా, అక్కడ నాన్నా అన్నయ్యానో" అంటూ బయలుదేరింది ఉష.

"మరయితే నాకు గోధుమ అన్నం వేరే వండావా?... అయితే సరే — సాయంత్రం చీకటి పడకుండా వేణు మాధవస్వామి గుడికి వస్తావుగా?... వెలుగు ఉండగా రావుణ్ణి పంపిస్తాలే!" అంటూ వెనక నుంచి కేకేసింది జోగమ్మ.

"సాయంత్రం గుడికి వెళుతున్నావా అమ్మా" అన్నాడు ప్రభాకరం. "అవున్రా— నువ్వు కూడా రా ... మరిచిపోకు ... అర్చన చేయిస్తున్నాను." అంది జోగమ్మ.

"అర్చనా? ... మొక్కుకున్నావా? ... ఏ సందర్భంలోనూ?"

"తర్వాత చెప్తాగాని నువ్వు రావడం మరిచిపోకు".

"అలాగేలే — సాయంత్రం గూడెంలో ఓ కేసు చూడడానికి వెళ్లాలి...అక్కడనుంచి తిరిగి వచ్చేటప్పుడు వస్తాను."

* * *

ప్రభాకరం ఇంట్లో సమృద్ధిగా చేతినిండా సంబారాలూ, విసిరి ఊది శ్రమపడక్కర్లేని గేస్ స్టౌ—వీట తోటి శుభ్రంగా రుచిగా వాలుగూ చేసిపెట్టి, తనింటికి వచ్చిన ఉషకి, పెట్టెలో చెయ్యి పెడితే చేతికి బియ్యం ఏం తగలలేదు.

గుండె ఝల్లుమంది!

బియ్యం అయిపోయినట్టున్నాయి...మళ్లీ ఇంట్లో ఏదోఒకటి అమ్మాలి ... ఈ లేమికి తోడు, అమ్మ కూడా లేకపోయింది, బాధని పంచుకోడానికైనా ఉండకుండా; మొత్తం అవస్థంతా తనకే అప్పగించి వెళ్లిపోయింది.

ఉషకి దుఃఖం కెరళ్ళు కెరళ్ళుగా పొంగి వచ్చింది. ఎంత ఆపుకుందామన్నా ఆగలేదు. బియ్యం పెట్టె పక్కనే కూర్చుండిపోయి గుండెలు పగిలేలా ఏడుస్తోంది. గుండెలో ఏదో వెలితి — ఏదో బెంగ — ఇదీ అని చెప్పలేని భయం. ఎంత నిశ్శబ్దంగా ఉండడానికి ప్రయత్నించినా ఏడుపు అప్పుడప్పుడు పైకి వచ్చేస్తోంది.

కూతురు ఏడుస్తున్న వైనం విని కంగారుగా కుక్కిమంచంమీంచి లేచి, గోడ సాయంతో ఎలాగోలాగ నడిచివచ్చి "ఏం అమ్మా! ఎందుకు ఏడుస్తున్నావు? ... చెప్పు తల్లీ... నా బంగారుతల్లివికదూ?... ఏం జరిగింది?" అని బుజ్జగిస్తూ అడిగాడు భద్రయ్య.

"ఏంలేదు" అన్నట్లు తల అడ్డంగా ఊపింది ఉష.

"నాకు చెప్పకపోతే ఎవరికి చెప్తావమ్మా... పోనీ చెప్పుకోడానికి మీ అమ్మయినా లేదు. ఈ వృద్ధాప్యంలో ఈ పేదరికాన్ని అనుభవిస్తూ నేను ఉండిపోయాను. అది హాయిగా పువ్వులా వెళ్ళిపోయింది. ఎప్పుడూ అది అదృష్టవంతురాలేలే!... నేనే పాపిష్టివాణ్ణి... మీరు బాధలూ ఇబ్బందులూ పడుతూంటే తీర్చలేక ఇలా చూస్తూ బతికి ఉంటున్నాను."

"నాన్నా ...".

"నిజమేనమ్మా — దాని అదృష్టం నాకేదీ?... కలిగినింట్లో పుటి నా యింటికి వచ్చింది. అది ఉన్నన్నాళ్ళూ ఇల్లంతా పెళ్ళివారిల్లులాగ వచ్చేపోయే జనంతో కలకల్లాడుతూ ఉండేది. ఎప్పుడూ చుట్టాలూ పక్కాలూ — పూటకి పాతికమంది లేచేవారు భోజనానికి ... అది ఉన్నన్నాళ్ళూ 'లక్ష్మి' కూడా అలాగే ఘల్లు ఘల్లుమంటూ కురిసేది ... దాంతోనే అంతా వెళ్లిపోయింది. అదీ, సిరీ ఇద్దరూ వెళ్లిపోయారు. జబ్బు చేస్తే పట్నం పెద్దాసుపత్రిలో జేర్పించి పొలం పుట్రా అంతా అమ్మి దాన్ని దక్కించుకోవాలని చూశాను. అదృష్టం ఉండొద్దమ్మా...మీ ఇద్దర్నీ నాకు అప్పగించి తను హంసలా ఎగిరి పోయింది" అంటూ కళ్లనీళ్ళు పెట్టుకుంటూ కూర్చున్నాడు భద్రయ్య.

తండ్రి కళ్లల్లో నీళ్లు చూసేసరికి ఉష కళవళ పడింది. తొందరగా తను కళ్ళు తుడుచుకొని, తండ్రి కన్నీళ్లు తుడిచి, "లే నాన్నా నిన్ను తీసికెళ్లి మంచంమీద కూర్చోపెడతాను" అంది. భద్రయ్య కూతురు సాయంతో లేస్తూ "ఎందుకు ఏడ్చావమ్మా? ... ఏం జరిగింది" అంటూ తల నిమురుతూ అడిగాడు. "ఏంలేదు నాన్నా ... ఏదో అమ్మ జ్ఞాపకం వచ్చేనూ ..." అంటూ మాట మింగేసింది.

"సరేనమ్మా ... మళ్లీ చెఋపు దగ్గర లాంటి సంఘటన ఏదైనా జరిగిందేమో అని నేను కంగారుపడ్డాను...సరేనమ్మా...సరే..." అంటూ మంచంమీద కూర్చుని దగ్గుతూ, మూలుగుతూ, ఆయాసపడుతూ ఉండిపోయాడు భద్రయ్య.

ఉష మళ్లీ వెళ్లి బియ్యం పెట్టె పక్కని చతికిలబడింది. ఏమిటి చెయ్యడం ఈ పూటకి? అన్నయ్య ఇంకాస్సేపట్లో వచ్చేస్తాడు. బియ్యం లేకుండా వాడికి అన్నం ఎలా వండి పెట్టడం? జోగమ్మగారింట్లో పని చేసే

*జరిగిన కథ 2:* భద్రయ్య గారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్య గారి ఆస్తంతా దాన ధర్మాలతో హరించి పోయింది. చదువంటకపోయినా చిత్ర లేఖనం నేర్చుకుంటాడు మురళి. అంకరాజు మిల్లులో గోడౌన్ కీపరుగా చేరతాడు మురళి. భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు డాక్టరు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు.

ఆ రావుడు నయం, తనకంటే ... కడుపు నిండా హాయిగా రెండుపూట్లా ఆ యింట్లో భోజనం చేస్తుంది. తన కంటే మంచి చీరలు కడుతుంది... ఏమిటో... తనదీ ఒక బతుకేనా ?... డబ్బులేని ఇంట్లో దరిద్ర దేవత పీడ కొట్లాడుతూ ఇలాగే బలి కోరుతూ ఉంటుంది... పోనీ ఈ యింటికి తను బలి అయిపోతే, ఈ యింటికి పట్టిన శని, దరిద్రం తీరుతాయేమో...

"మురళి గారూ !... మురళి గారూ !"

## గాజు మేడ

అంటూ వీధిలోంచి సీతాలు కేక వినిపించి ది. దగ్గు తెమలక భద్రయ్య సమాధానం చెప్ప లేని స్థితిలో ఉన్నాడు. అందువల్ల ఉషే వీధి గుమ్మం దగ్గరికి వెళ్లింది.

"అన్నయ్య లేరా ?"

"లేదు ఇంకా రాలేదు."

"అయితే వచ్చాక చెప్పండి... స్టాంపులు పెద్దవి లేక ఇక్కడ కట్టడం పడలేదట... మందులకోసమని పొద్దుట పట్నం వెళ్లి నప్పుడు సీతాలు అక్కడ పెద్ద పోస్టాఫీసులో కట్టాడట... ఇదిగో రశీదులు ఇచ్చాడు అని చెప్పి ఇవ్వండి" అంటూ రెండు రశీదులు ఉష చేతిలో పడేశాడు .." పోస్టాఫీసులో ఏం కట్టావు ?... ఈ రశీదులు ఏ బాపతు ?"

"అయేనండి ఆ బొమ్మలేవో ఢిల్లీ ఎల్లార్సినవి. గట్టిగా అట్టలూ కాగితాలూ ఏసి గట్టి పార్సిలు చేశాలెండి."

"అహా... అవా ?... అవున్లే ఒకటి



పోటీకి... ఒకటి ఎగ్జిబిషన్‌కి...''

సీతాలు వెళ్ళిపోతానంటే ఉషకి ఒక ఆలో చన వచ్చి "ఒరేయ్ సీతాలూ! ఓ మాటు అలా పెరటి గుమ్మం దగ్గరికిరా !''అంటూ పిలిచింది... అలా వచ్చిన సీతాలుకి తను నీళ్ళు తెచ్చుకొనే ఇత్తడి బిందె ఇచ్చి "ఒరేయ్ ఇది అమ్మేసి వచ్చినడబ్బుల్లో రెండు రూపాయలు పెట్టి బియ్యం పట్రారా. బియ్యానికి సంచీ ఇవ్వనా?'' అంది.

"మళ్ళీ ఇంకో సామానుకి కాళ్ళొచ్చా యన్న మాట! నా చేతుల్తోటె నేను అమ్మానమ్మా, మీ ఇంట్లోది బండెడు సామాను!...సరే కాని య్యండి...రోజు ఎప్పుడూ ఇలాగే ఉంటాయా? కాలం కలిసొస్తే రెట్టింపు సామాను కొనుక్కో వచ్చు...మురళిబాబు ఉద్యోగంలో చేరాడుకదా! కష్టాలు ఇంకెన్నాళ్ళుంటాయి లెండి 'అంటూ బిందె పుచ్చుకుని.

కాపురాలు కుదుటబడాలి!

కష్టాలికి కాళ్ళురావాలి!

అంటూ కూనిరాగం తీస్తూ, బిందెని అడ్డం తిప్ప మద్దెలలా వాయిస్తూ, పాట ధ్యాసలో, ఎదురుగుండా సజ్జలో పువ్వులు తెచ్చి పెట్టుకుంటూ తలవంచుకొనివస్తూన్న రావుణ్ణిఢీకొన్నాడు సీతాలు. వెంటనే ఇద్దరూ తలెత్తి ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు"అమ్మ బాబోయ్ నువ్వా?''అంటూ ఒక్క అరుపు అరిచి బిందె పైనున్న పెట్టుకుని పరుగు తియ్యబోయాడు సీతాలు.

"ఎవరూ? ... నువ్వా? ... ఏవిటి అవతారం? ... బిందె ఎట్టుకుపోతున్నావు ఎక్కడికి? అమ్మగారండోయ్ ఈడు బిందె ఎత్తుకుపోతున్నాడు!'' అంటూ అరిచింది రావుడు.

"ఏంటి నాను దొంగాననుకున్నావా?'' అంటూ ఎదురు తిరిగాడు సీతాలు. ఇదంతా పెరటి గుమ్మంలో నిలబడి చూస్తూన్న ఉష కంగారుగా "రావుడూ నువ్వటురా... వాడికి బిందె ఇచ్చి నేను పంపిస్తున్నాను నీళ్ళకి'' అంది.

"ఆహా...అయినా మొగాడు ఆడు నీళ్ళు ఏం తేగలడండి!... ఏయ్! ఆ బిందె ఇలా ఇయ్యి నే తెస్తా నీళ్ళ'' అంటూ రావుడు తన చేతిలో పూలసజ్జ సీతాలు చేతిలో పెట్టి వాడి చేతిలో బిందె తను లాక్కో పోయింది. సీతాలు నివ్వెరపోయంగా ఉష కేసి చూశాడు... రెండోకంటి వాడికి తెలియకుండా ఆ బిందె అమ్మించి బియ్యం తెప్పిద్దాం అంటే, ఈ రావు డెక్కడ తయారైంది మధ్యలో అని విసుక్కొని "ఆ బిందె వాడిని పట్టిగెళ్ల నియ్యి ... నువ్విలా రా'' అంటూ కేకేసింది ఉష.

"సరే" అని బిందె వాడికి వదిలేసి తిరిగి సజ్జ తను తీసుకుంది రావుడు ... "అబ్బ!... ఇదంతా పువ్వుల వాసనే? నమ్మకం లేదు... కొందరు ఆడపిల్లలు దగ్గిరి కొస్తే కూడా ఇలా కమ్మని సువాసనలేస్తాయట ... సరే కానియ్యి'' అంటూ సన్నగా చెవిలో అనేసి, మళ్ళీ తిరిగి బిందెని మద్దెలలా వాయించు కుంటూ వెళ్ళిపోతూన్న సీతాలుని సోగ కన్ను లతో బుగ్గని చెయ్యి పెట్టుకొని వింతగా చూసి, ఆ తర్వాత ఉష దగ్గరికి వచ్చింది రావుడు.

"ఇదిగో అమ్మా... అమ్మగారు సన్న జాజులు పంపారు... పెట్టుకోండి... మిమ్మల్ని తీసుకుని గుడికి రమ్మన్నారు.''

"నేనూ రావాలిలే ఇవాళ గుడికి...మరైతే ఇంకా వంటకాలేదు... వంట చేసుకుని ఒక అరగంటలో వస్తానని చెప్ప...నువ్వెళ్ళు...'' అంటూ సజ్జలో పువ్వులు తీసుకుంది ఉష.

"నన్ను దగ్గరుండి తీసుకురమ్మన్నా రమ్మా.''

"ఇంకో అరగంటదాకా నువ్వేం చూసుం టావు ఇక్కడ? నేను వస్తానన్నానుగా?... అవునూ?... పువ్వులు మాలకట్టి కూడా పంపాలా? నేను కట్టుకోనూ?''

"ఏమోనమ్మా... అమ్మగారే కట్టారు... నేను వస్తా'' అంటూ రావుడు వెళ్ళిపోయింది ఖాళీ సజ్జ తీసుకుని.

జాజిమాలని దోసిట్లోకి తీసుకుని, వింతో కాంక్షతో చాలా సేపు గాఢంగా వాసన చూసింది ఉష. మనస్సుకి ఏదో మత్తు పులిమినట్లయింది. నవ్వుకొని, బొట్టు పెట్టె కాటిక్కాయా ఉన్న గూటి పక్కని, చెక్క అద్దం ఉన్న మేకుని, జాజిమాల తగిలించి పొయ్యి అంటించడానికి వెళ్ళింది.

సీతాలు తీసుకొచ్చిన బియ్యం, మిగిలిన డబ్బూ పుచ్చుకుని వాడిని పంపించేసి వంట ప్రయత్నం మొదలెట్టింది. అరగంటలో అన్నం వండి గూనలో గోంగూర తీసి మూరి అక్కడ పెట్టింది.

తర్వాత కూనిరాగం తీసుకుంటూ వదులుగా జడ వేసుకుని జాజులు పెట్టు కుంది. మొహం రుద్దుకొని చెక్కద్దంలో చూసుకుంటూ కళ్ళకి కాటుకా, నుదుటను తిలకం దిద్దుకుంటున్నప్పుడు, తన అందం తనకే ఆశ్చర్యం కలిగించింది. జడలో జాజులు గుండెల్లో ఏవో మూగ కోరికల్ని రెచ్చగొడు తూంటే, ఆ కోరికల బరువుకి కింద పెదవి అదిరి, కనురెప్పలు భారంగా వాలిపోసాగాయి. మనస్సులో మరులు మరీ ఇలా ముఖం మీద కనిపించిపోతే ఎలా? 'చాలా ఇబ్బంది బాబూ' అనుకొంది.

ఈ స్థితిలో తను గుడికి వెళితే ఇంకే మైనా ఉందా? తన హృదయాన్ని అందరూ ఇట్టే చదివేయగలరు. అందులో ఇవాళ ప్రభాకరం కూడా వస్తాడు కాబోలు గుడికి ...మరెలాగ? ... పోనీ ఇవాళ వెళ్ళడం మానేస్తే?...తను ఎన్నాళ్ల నుంచి వెళ్లడం



లేదూ? అయినా ఆ దేవుడికి దయ గలిగిందా? నాన్న అనారోగ్యం, తమ దారిద్ర్యం అలాగే ఉన్నాయి ... కాని మరి అన్నయ్యకి ఏదైనా ఉద్యోగం వస్తే వేణుమాధవ స్వామికి కొబ్బరి కాయ కొడతానని తాను మొక్కుకుందే ... ఆ...అయినా ఇదీ ఒక ఉద్యోగమేనా ఏమిటి పోనిద్దూ ?... కాని...మరి...తను జోగమ్మ గారికి కబురు చేసిందే, గుళ్లోకి వస్తానని?... అవును వెళ్లాలి...తన ముఖంచూసి. మనస్సు అర్థం అయి ప్రభాకరం అదోళ్లా నవ్వుతాడు ...ఊ...నవ్వనీ... తనకేం ?

తండ్రితో "ఇప్పుడే గుళ్లోకి వెళ్లి వస్తానని" చెప్పి కొబ్బరికాయ, దక్షిణ కోసం కొద్దిగా డబ్బులూ, ముందు పెరట్లో పూసిన రకరకాలవి దోసెడు పువ్వులూ పుచ్చుకొని, బయల్దేరింది ఉష సందె దీపం పెట్టి వీధి వాకిళ్లలోకి వచ్చి నిలబడ ఆడ వాళ్లని వరసలు పెట్టి పలకరిస్తూ, దేవాలయం కేసి వెళుతూన్న ఉషకి, దారిలో అంకరాజు ఎదురయ్యాడు. అతణ్ణి చూడగానే అంత క్రితం సీతాలు చెప్పినదంతా జ్ఞాపకం వచ్చి, అతనంటే ఒకరకమైన వెరపూభయం, వెగటూ అసహ్యంవేసి, ముఖం చిట్లించి పక్కకి తిప్పుకొంది ఉష.

అంకరాజు మాత్రం నవ్వి "ఏమిటి చీకటడి బయలుదేరావు ఎక్కడదాకాను ?" అంటూ కావాలని పలకరించాడు అతనికి సమాధానం చెప్పడానికి అసహ్యంవేసి మౌనంగా నడవ సాగింది ఉష ... "ఒక్కద్దానివే వెళుతున్నట్లున్నావు... నేను సాయం రానేంటి ?" అంటూ వెనకాలే రాబోయాడు అంకరాజు. ఉషకి భయంవేసింది. కాని వెంటనే ధైర్యాన్ని పుంజుకుని "అవసరం లేదు ... పైగా అదిగో వెనకాల సీతాలు వస్తున్నాడు సాయం. వెళ్లేది జోగమ్మగారి దగ్గిరకి కనక వచ్చేటప్పుడు ఆవిడే పంపిస్తారు ఎవర్నేనా" అంది.

సీతాలు పేరు చెప్పగానే బెదురూ, జోగమ్మగారంటే భయంలో కూడిన గౌరవం, మనస్సులో మెదిలి, తత్తరపాటుతో "అయితే... సరే... నువ్వంతా పెద్ద లెక్కల్లో మనిషి అయిపోతున్నావు. కొన్నాళ్లకి చిన్నపలు పలకరించడానికే అందకుండా అయిపోతావు... కానీ... కానీ..." అంటూ గబగబా వెళ్లిపోయాడు. "హమ్మయ్య" అని గుండెలమీద చేతులు వేసుకుంది ఉష తర్వాత నవ్వుకుంది కూడా "అయితే వీడికి సీతాలన్నా



జోగమ్మ గారన్నా కొంచెం భయం ఉందన్న మాట !" అనుకొని.

ఊళ్లో అందర్నీ పలకరిస్తూ అందరి యోగక్షేమాలూ తెలుసుకుంటూ రావడం వల్ల జోగమ్మ కూడా ఆ సమయానికే జేరుకుంది ఆలయానికి. "వచ్చావా అమ్మా చూడు వీడింకా రాలేదు" అని జోగమ్మ అంటూంటే, "రాకపోవడం ఏమిటి, వచ్చేశానమ్మా" అంటూ ధ్వజస్తంభానికి దూరంగా మండపం వారని బూట్లు విప్పుతూన్న ప్రభాకరం కనిపించాడు. ఇంతలో

## ఫలితం...

చదివాను ఎన్నెన్నో పుస్తకాలు
ఫలితం ... పొందాను ఎన్నో డిగ్రీలు
పంపాను ఎన్నో అప్లికేషను ఫారాలు,
ఫలితం...కొన్నిటికి వచ్చాయి యింటర్వ్యూ పిలుపులు
వెళ్ళాను చాలా యింటర్వ్యూలు
ఫలితం ... శూన్యం
తెలిసొచ్చింది నాకు అప్పటికి
వాళ్ళకు డిగ్రీలతో పనిలేదని.
చదువులతో నిమిత్తం లేనే లేదని
ఉత్తర దక్షిణాలు మాత్రమే అవసరమని
అయినా వేచాను ఓపికతో ఎన్నెన్నో రోజులు
ఫలితం ... ఎక్కువమందికి వచ్చే నిరాశ, నిస్పృహ.

— నాగేశ్వరరావ్ ఈమని

గర్భగుడిలోంచి పదిహేనేళ్ల ఆచార్లుగారి అబ్బాయి పరిగెట్టుకుంటూ ఇవతలకివచ్చి జోగమ్మకీ ప్రభాకరానికీ నమస్కారాలు పెట్టి "రండమ్మా రండి" అన్నాడు.

జోగమ్మ భర్తే ఆ ఆలయ పునరుద్ధరణకి పూనుకోవడంవల్ల నైతేనేమి, ఆయన దేవుడిపేర రాసిన పది ఎకరాల మాన్యం మీద వస్తూన్న ఫలసాయాన్ని ఇన్నేళ్ల నుంచీ అనుభవిస్తూండడం వల్లనేమి, ఆచార్లుగారి కుటుంబానికి జోగమ్మగారన్నా ప్రభాకరం అన్నా వేణుమాధవ స్వామి తర్వాత మళ్లీ అంతటివాళ్లులాగ కనిపిస్తారు. వాళ్లిద్దరికీ తండ్రి యిచ్చే గౌరవాన్ని ఇంతక్రితం ఎన్ని మార్లో చూశాడు కనకే ఆ ఆచార్లుగారి అబ్బాయికూడా అంత మర్యాదగానూ ప్రవర్తించాడు.

ఆ కుర్రాణ్ణిచూసి "అర్చన చేయించాలి... మీ నాన్నగారు లేరా ?" అంది జోగమ్మ.

"ఇప్పటికి వారం పదిరోజులయి మంచం మీంచి లేవడంలేదండి ... డాక్టరుగారేగా మందిస్తున్నారు!... నేను చేయిస్తానండి అర్చన... నాకూ మంత్రాలు వచ్చు."

'ఏం చేయిస్తావో... మధ్యలో ఇంగ్లీషు పాటలు మాత్రం దొర్లించకేం ?"

"ఇంగ్లీషులో కూడా మంచి మంత్రాలే ఉన్నాయమ్మా" అన్నాడు ప్రభాకరం సీరియస్‌గా.

"ఉంటే ?... ఇంగ్లీషులో చేయిద్దాం ఏమిటి పూజ ?"

ముగ్గురూ గర్భగుడిలోకి వెళుతూ ఉండగా "అసలీ పూజ ఎందుకమ్మా ... అప్పుడు అడిగితే తర్వాత చెప్తానన్నావు" అన్నాడు ప్రభాకరం. జోగమ్మ నవ్వుతూ "ఆ పిల్ల పురిటికి అపరేషన్‌చేసి బిడ్డను తియ్యాలసి వచ్చింది కదరా... పట్నం నుంచి పెద్ద డాక్టరుని కూడా పిలిపి చావుగా ?... అప్పుడు మొక్కుకున్నాను తల్లీ పిల్లా కులాసాగా ఉంటే అర్చన చేయిస్తా"నని అంది.

ప్రభాకరం మొదట తెల్లబోయి, ఆ తర్వాత నీరసంగా నవ్వి "అయ్యో పిచ్చి అమ్మా!... తెల్లారి లేస్తే అనేకమంది పేషెంట్లు వస్తారు... ఇలా అందరిపేరా పూజలూ అర్చనలూ చేయిస్తే అయినట్టే" అన్నాడు.

'ఊరుకోరా! నేను మరీ అంత వెర్రి దాన్నేమిటి ? ఆ పిల్ల తండ్రి మీ నాన్నకి నమ్మినబంటులా ఉండేవాడు. మీ నాన్నగారు కుర్చీ వేసుక్కూచుని అన్నీ పురమాయిస్తూంటే, రాత్రింబగళ్లు నిద్రాహారాలు మాని నీ హాస్పటలూ, ఇప్పుడు మనం ఉన్న ఇల్లూ మొత్తం ఈ బిల్డింగ్ అంతా అతను కట్టించాడు. అలాంటి నమ్మకస్థుడూ, నిజాయితీ అయినవాడూ దగ్గర లేకపోతే మీ నాన్నగారు చాలా శ్రమపడి ఉండేవారు తెల్సా ?...నువ్వు ప్రాక్టీసు పెట్టడం, ఇలా హాయిగా ఉండడం చూసుకోడానికి మీ నాన్నగారితోపాటు అతనూ నోచుకోలేదు. దున్నపోతుల బండి తోలుతూ తొట్టిలో కూచున్నాడట ఏం ఖర్మో కిందపడ్డాడట... అంతే ... పోతులు, బరువు బండిని అతని మీంచి లాగేశాయి" ఇలా చెప్తూ అప్పటికప్పుడు ఆ సంఘటన కళ్ళెదురుగా జరుగుతున్నట్లు కంపించిపోయి ముఖం అంతా విషాదంగా పెట్టేసింది జోగమ్మ.



## అందాలు చిమ్ముతూ ఆకర్షణ వెద చల్లితే



## మీ దారి పొడవునా చూపుల తోరణాలే !

లాక్మే వానిషింగ్ క్రీం మీ సౌందర్యానికి రాచబాట. మంచులో తడిసి తొలికాంతిలో విరిసిన పూవులా మిస్తు చేస్తుంది.

శ్రేష్ఠమైన మేకప్‌కు ఆదర్శవంతమైన ఆధారము లాక్మే వానిషింగ్ క్రీం. దీనిపై పౌడరు చాలాసేపు పట్టుకొనివుంటుంది.

ఎంతో తేట అయింది, ఎంతో సహజమైంది; అయినా ఎంత మార్పును తెస్తుంది.

**లాక్మే వానిషింగ్ క్రీం**

అద్దుకొన్న పౌడరును పట్టుకొని వుంచుతుంది.






మీ సౌందర్య పోషణ మా ఏకైక ఆశయం

UCP LVC 2 a Tel

## గాజు మేడ

"పోనీలేఅమ్మా ఇప్పుడాసంగతి ఎందుకు?"

"అదేవిటా? దేవుడి గుళ్లో మాత్రమే తెలుసుకోవలసిన మనుష్యులు కొందరున్నారు. అటువంటివాళ్లల్లో అతనొకడూ, ఇదిగో వీళ్ల నాన్న భద్రయ్యగారొకరూను డబ్బేం ఉందిరా, మనిషి విలువ గొప్పగి. తెల్సా ?" అంది–ఎవ్వరూ మాట్లాడలేదు.

ఆచార్లుగారి అబ్బాయి పళ్ళెం పట్టాడు. జోగమ్మ ఆ పళ్ళెంలో పళ్ళూ, పువ్వులూ, అగరవత్తులూ, హారతికర్పూరం అన్నీ పెడుతూ. "అరే... కొబ్బరికాయ తేలేదే... ఊ... నువ్వు తెచ్చావా ఉషా? మంచి పని చేశావు" అంది. ఆచార్లు పళ్ళెంలో ఉష కొబ్బరికాయ ఉంచుతున్నప్పుడు "అంతా ఒకటే కదాండీ!" అన్నాడు ఆచార్లుగారి అబ్బాయి.

"కాదు... వేరు... కొబ్బరికాయ నా పేర కొట్టు" అందాం అనుకొంది ఉష కాని ఇంతలో జోగమ్మ "ఆ...అంతా ఒకటే" అంది.

"అర్చన బాబుగారి పేరనేనా ?"

"అది అడగాలా? అదే కుర్రతనం పూజలంటే" అంటూ కోప్పడింది జోగమ్మ.

"పోన్లే అమ్మా... కుర్రాడుకదా ?... అనుమానం వచ్చి అడిగాడు... వాళ్ల నాన్న కయితే తెలుసు" అంటూ సర్దాడు ప్రభాకరం.

'సకుటుంబస్య, సపరివారస్య' అంటూ పూజ మొదలెట్టాడు. తనని కూడా ప్రభాకరం కుటుంబంలో ఒక వ్యక్తిగా జమ కట్టేస్తున్నాడే ఈ పూజారి కుర్రాడు అంటూ ఇబ్బందిగా కదిలింది ఉష.

అర్చన జరుగుతూన్నంతసేపూ ముగ్గురూ ఏకాగ్రతగా దేవుడివేపు చూస్తూ, మనస్సు లన్నీ భక్తి భావంతో నిండిపోతూంటే, చుట్టూ ఉన్న లోకాన్ని మరచి పరవశత్వంతో కూర్చున్నారు. కొబ్బరికాయ కొట్టి నైవేద్యం పెట్టి హారతి వెలిగించాడు ఆచార్లుగారి అబ్బాయి. కర్పూర హారతి తాలూకు కాంతి, వేణుమాధవ స్వామిని అలంకరించిన వెండి తొడుగుమీదా, రత్నాల కిరీటంమీదా, కెంపులతో అద్దిన ఎర్రని నామంమీదా, పచ్చలపతకం మీదా పడి, జిగేల్ మంది.

వేణు మాధవ స్వామి చిరునవ్వులు చిందిస్తూ వేణువుని ఊదుతున్నాడు. మంత్ర పుష్పం అయ్యాక పువ్వులతోపాటు తను తెచ్చిన దక్షిణ కూడా పళ్లెంలో వేసింది ఉష. ప్రభాకరం జేబులోంచి అయిదురూపాయల నోటు తీసి పళ్లెంలో ఉంచాడు. ఆచార్లుగారి అబ్బాయి ముఖం, దీపాల వెలుగుతో ఆనందాశ్చర్యాలతో ఒక్కమారు కాంతితో ప్రకాశించింది. పాదుకలు ఇచ్చి ముగ్గురికి ప్రసాదం పువ్వులూ ఇచ్చాడు ఆచార్లు. తన చేతిలో పెట్టిన కొబ్బరి కాయ చెక్కా పళ్ళూ, తల్లి చేతిలోపెట్టి, "పువ్వులు ఇదిగో తల్లో పెట్టుకో" అంటూ ఉష ఒళ్లోకి విసిరి "ఇంక నేను వస్తానమ్మా అవతల పేషెంట్లు ఎదురుచూస్తూ ఉంటారు" అని, ఉష వేపు ఒక చూపూ దేవుడివేపు ఒక చూపూ విసిరి వెళ్లిపోయాడు ప్రభాకరం, బయట వదిలిన బూట్లు తొడుక్కోవడం కోసం.

ఒళ్లోపడ్డ పువ్వులకేసి ఓమారు చూసి తర్వాత జోగమ్మకేసి చూసింది ఉష.

'వాడికి చదువంటే వచ్చిందికాని'... ఏం తెలియదు'అంటూ నొచ్చుకుందిజోగమ్మ.

ఆ రాత్రి ఇంట్లోకి వస్తూనే "ఉన్న ఆ ఒక్క బిందెనీ అమ్మించేశావు. రేపటినుంచి నీళ్లు దేంతో తెస్తావు?" అంటూ గయ్ మన్నాడు మురళి.

"గట్టిగా అరవకురా... నాన్నవింటే బాధ పడతాడు... బిందెపోతే యేం?... రేపు నీ జీతం వస్తే ఇంకో బిందె కొనుక్కోవచ్చు... అ... అప్పట్టు నీ చిత్రాలు పార్సిల్ చేసి పోస్టులో పంపాడట... సీతాలు రసీదులు తెచ్చి ఇచ్చాడు" అంటూ పెట్లో దాచిన రసీదులు తీసుకువచ్చి ఇచ్చింది ఉష.

మురళికి అన్నంపెట్టి తండ్రికి జావకాచి ఇచ్చాక, ఎంతసేపటికో కాని అన్నం తినబుద్ధి వెయ్యలేదు.

ప్రభాకరం తన ఒళ్ళోకి విసిరిన పువ్వుల్ని చేత్తో పట్టుకుని ఆ మట్టునే చాలాసేపు పరధ్యానంగా ఉండిపోయింది. తన జడలో పువ్వులలాగే ఇవికూడా తెల్లారేటప్పటికి వాడిపోతాయి...

తన కోరికలుకూడా అలాగే...

ఏమిటో తన జీవితం గురించి ఆలోచిస్తూంటే, అడవిలో ప్రయాణంలాగ ఓ దారీ తెన్నూ కనిపించడంలేదు.

నిట్టూర్చింది ఉష.

అంతకంటె చేసేదీ లేదు

[ఇంకా వుంది]



# ఇప్పుడు! చల్లగా, తాజాగా ఉండండి సుదీర్ఘమై వెచ్చని వేసవి రోజంతా

మరియొక విద్యుచ్ఛక్తి కోత! నిజంగా రాబోతోంది సుదీర్ఘమైన వెచ్చని వేసవి. కాని చల్లగా. తాజాగా ఉండేందుకోసం ఇదుగో కొత్త మార్గం. స్నానం తదుపరి మీ శరీరంపైనంతా జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరు చల్లండి. ఒక్క జాన్సన్స్ మాత్రమే **మెంథాల్** కలిగియున్నది. మిమ్మల్ని చల్లగా, తాజాగా ఉంచేందుకు, మీ చర్మాన్ని పొట్టురేగుట మరియు పేలుటనుంచి రక్షించి హాయిగా ఉంచేందుకు. వేసవి వేడిని తగ్గించండి వాడండి జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరు.

# జాన్సన్స్* మెంథొలేటెడ్ పౌడరు

## '75 వేసవికోసం ఒకేఒక మెంథాల్-కూల్ పౌడరు.




* Trademark © J&J 75

Johnson & Johnson*

ఉదయం తొమ్మిదయింది. ఎండ ఎఱ్రబడింది. ఎఱ్రబడ్డ ఎండకు వేడెక్కిన గాలిని వేప చెట్టు *గుమ్మంలో తాతయ్యగారు గాని వున్నారేమోనని అనుమానంగా చూసి, లేరని నిర్ధారించుకున్నతర్వాత* తమాయించుకుని, నాలుగంగల్లో ధనం యింటి కెదురుగా నున్న మామిడిచెట్టు క్రిందకు జేరింది వర్ధని.

మామిడిచెట్టు మీద అలసట తీర్చుకుంటున్న కాకి ఎగిరి మరో కొమ్మమీద కూర్చుంది.

తలంటుకోడంవల్ల రేగిన జుట్టు చెదిరి ముంగురులు ముఖాన్నావరించుకుని చికాకుపరుస్తుండగా చెట్టు నీడలో నిల్చుని ధనంకోసం ఎదురు చూడసాగింది. ధనంతో ఏదో చెప్పాలనే తపన -- వెళ్లిపోయేముందు చివరిసారిగా ఎన్నెన్నో మాట్లాడాలనే ఆతృత.

పరుగెత్తడంవల్ల వచ్చిన అలుపు పోకుండానే ఎదురుగా నిలిచింది ధనం – ఎఱ్ర వాయిల్ వోణీ, ఆకుపచ్చంచు తెల్లపరికిణా, రెండు జడలు – ధనం ఎందుకో కొత్తగా కన్పించింది. సంతోషంతో వచ్చినదల్లా ఒక్కసారి ముఖం మార్చేసి- "నన్నొదిలి వెళ్లిపోతున్నావన్నమాట" అంది చిక్కమొగమేసుకుని. ధనం రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకుని – "పచ్చిపిల్లా నే వెళ్లిపోతానంటే నీకెందుకంత బెంగ? తులసి, శ్యామలా లేరూ" అంది.

ధనం కన్నీళ్లు నాపుకోలేక పోయింది.

"అవున్లే నీకు నన్ను విడిచిపెట్టడమంటే ఏం అన్పించటం లేదుగదూ—నీకేమో అక్కడ మంచి మంచి స్నేహితులు దొరుకుతారు. ఎంచక్కా చదువుకుంటావు నేనేమో యిలా వంటరిగా పల్లెటూరిదానిలానే వుండిపోతాను." ధనం ఉక్రోషానికి అంతదు ఖంలోనూ నవ్వుకుంది వర్ధని

"నువ్వుమాత్రం ఎన్నాళ్ళుండిపోతావీ పల్లెటూళ్ళో రేపో మాపో మీ నాన్న నీకు పెళ్లి చెయ్యక మానడు నీకు తోడుగా ఏ పిల్లజమిందారో దొరికితే అప్పుడు నిజంగా మేం జ్ఞాపకమొస్తామేమిటి? అంతవరకూ తులసీ, శ్యామలా వుండనే వున్నారు. ఇంకా అలా బెంగపడవలసినదాన్ని నేను. కొత్తవూరు, కొత్త వాతావరణం. స్నేహితుల్నీ పుట్టిపెరిగిన వాతావరణాన్నీ వదులుకుని వుండాల్సిన దాన్ని నేను"

"మరి అక్కడ నుండి అన్ని సంగతులతోనూ వుత్తరాలు రాస్తుంటావా?"

"ఓ! నీక్కాకపోతే యింకెవరికి రాస్తాను? అలా అని నువ్వు రాయకపోతే నేనూ మానేస్తా జాగ్రత్త! తెల్సుగా ఈ వూరికి ఆ వూరెంతో.."

"ఆ వూరికి యీ వూరూ అంతే." పూర్తి చేసింది ధనం

స్నేహితులందరికీ చెప్పి వచ్చిందే గాని పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది వర్ధని. ఎవరూ చూడకుండా ఓ అయిదు నిముషాలలాగే ఓ మూల కూర్చుని ఏడ్చింది.

"అమ్మాయ్ వర్ధనీ! తొరగా తయారు కామ్మా – నర్సిగాడితో చెప్పాను బండి తోలుకు రమ్మని" తాతగారి కేకకు కళ్లు తుడుచుకుని లేచి వంటింట్లోకి వెళ్లింది

"చూడమ్మాయ్! నీ లంగాలూ జాకెట్లూ వోణీలూ అన్నీ సంచీలో సర్దుకుని జడవేసుకో – అన్నాలు తిన్నాక కాస్సేపైనా బడలిక తీర్చుకోవచ్చు" అంటూ, "అదేమిటే అలా దిగులుగా వున్నావ్! ఎవరైనా ఏమైనా అన్నారా" అంది మహాలక్ష్మమ్మ వర్ధని వైపు దీక్షగా చూస్తూ.



తన చల్లని చేతులతో వడగట్టడానికి ప్రయత్నిస్తోంది.

చెంగున వీధిలోకి పరుగెత్తి నీళ్ళబిందెతో మడిగా ఎదురుగా వస్తున్న పక్కంటి సుభద్రమ్మగార్ని ఢీకొనబోయి

"లేదమ్మమ్మా! ధనం యింటికెళ్ళి ఏస్తాంటే కంట్లో ఏదో పడింది" అని కళ్లు రుద్దుకుంది

"ఏమోలే అమ్మా! నిన్నెక్కడికో అడవిలోకి తీసికెళ్లి పోతున్నట్టు మీ అమ్మకూడ దిగులుగా వుంటేనూ" అంటూ సాగదీస్తున్న ఆవిడవేపు చూసి, ఎప్పుడూ వున్న గొడవే అనుకుని మధ్య గదిలోకి వచ్చేసింది వర్ధని.

కిటికీ లోంచి ఎటో చూస్తూ ఆలోచిస్తూన్న కూతురు దగ్గరగా వచ్చి "చూడమ్మా! నీకెన్ని రోజులు తోస్తే అన్నిరోజులక్కడ వుండు నీకు రావాలని వున్నపుడు మాత్రం చిన్న మామయ్యతో చెబితే పంపిస్తాడు" అంది మాణిక్యమ్మ.

తల్లి ముఖంలోకి ఒక్క క్షణం చూసి కళ్లలో నీరు నింపుకుంది. 'నాకు వెళ్లాలని లేదమ్మా' అని చెబుదామనిపించింది. కూతురు కళ్ళలోని దిగులు గ్రహించిన మాణిక్యమ్మ "చూడమ్మా వర్ధనీ! నువ్వు కూడ అన్నయ్యలా పట్టుదలగా చదవాలి ఈ పల్లెటూళ్లో ఏముంది చెప్పు" అంటూ అటుగా వచ్చిన మహాలక్ష్మమ్మగార్ని చూసి మాట మార్చి "లేవే! తొ్రరగా తెమలాలి మరి."

తల్లి అమాయకత్వానికి జాలి కలిగింది వర్ధనికి. లేచివెళ్లి తనదనుకున్న ప్రతి వస్తువునీ జాగ్రత్తగా పెట్టెలో పెట్టుకుంది.

"అక్కా! అక్కా! నేనూ రావద్దా నీతో" అంటూ దగ్గరకొచ్చాడు వాసు వాడి వెనకాలే జారిపోతున్న లాగును పైకి లాక్కుంటూ తను అడిగేది కూడ అదేనన్నట్లు నిల్చున్నాడు క్రిష్ణుడు.

"చూడు వాసూ! నే వెళ్లాక నీకు మంచి మంచి బొమ్మలూ, బొమ్మల పుస్తకాలూ అన్నీ పంపిస్తా ఏం! నువ్వేమో బుద్ధిగా చదువుకోవాలి మరి. ఆ తర్వాత నువ్వు, అమ్మ, తమ్ముడూ అందరూ అక్కడికే వచ్చేద్దురుగాని" అంటూ పెట్టె అడుగున తను దాచుకున్న చిల్లర డబ్బులు తీసి వాడి జేబులో పోసింది.

"మా అక్క మంచిది! రారా! తమ్ముడూ! ఆడుకుందాం" అంటూ వెళ్లిపోయాడు వాసు.

* * *

భోజనాలయ్యాక సర్దుకున్న సామానంతా వీధి నడవలోకి చేర్చి, వాలుకుర్చీలో కూర్చుని నర్సిగాడి కోసం ఎదురుచూడ్డం మొదలెట్టారు మాధవరావుగారు. ఆయనతో ప్రయాణమంటేనే అందరికీ హడల్! వెళ్లే టైముకు రెండుగంటలు ముందే రెడీ అవ్వాలంటారాయన.

లోపల హాలులో మంచంమీద కాస్త నడుం వాల్చింది మహాలక్ష్మమ్మ. భోజనమయ్యాక కాస్సేపలా విశ్రాంతి తీసుకుంటేగాని ఏ పనీ చెయ్యదావిడ.

ఆవిడగారు చెప్పినట్టూ పండక్కి పెద్ద మామయ్యగారు కొన్న పట్టులంగా, సిల్కువోణి వేసుకుని మధ్య గదిలో కూర్చుని కిటికీలోంచి చూస్తూ ఆలోచనలో పడింది వర్ధని.

అంట్లన్నీ పనిదానికి వేసి వంటగదిని శుభ్రం చేసి ప్రయాణానికని చేసిన టిఫిన్, కేరేజీలో సర్ది వీధిలోకి తొంగిచూసి "నర్సిగాడు రావటానికింకా టైమున్నట్లుంది. మీరొక ఘడియ నడుం వాల్చరాదు నాన్నా" అంది మాణిక్యమ్మ తండ్రి నుద్దేశించి



"పడుకుంటే ఎలా అవుతుందమ్మా! ప్రయాణమంటేనే నాకు నిద్రపట్టదని నీకు తెల్సుగా! ఈ వెధవ నర్సిగాడు టైంకి వచ్చేట్టు లేడు. నాలుగు గంటలకన్నా అన్నయ్య దగ్గరకు చేరుకుంటే అదీ యిదీ మాట్లాడేసర్కి ఆ బండి టైమూ అవుతుంది." అంటూ వీధిలోకి దృష్టి సారించారాయన.

ఫెళఫెళలాడుతూన్న ఎండ వేడిగాతగుల్తున్నా, మధ్య మధ్య చల్లనిగాలి ఆహ్లాదాన్ని కలిగిస్తూనే వుంది. టైము రెండు కావస్తున్నా నర్సిగాడి జాడ లేదు. ఈజీ చైర్ లోంచి లేచి, నాలుగు పచార్లు చేసి కూజాలో నీళ్ళు కాసిన్ని తాగి మళ్ళీ కుర్చీలో కూలబడ్డారు మాధవరావుగారు

ఎట్టకేలకు దూరంగా ఎడ్లబండి సవ్వడి విన్పించింది. మాధవరావుగారు వున్నపాటున లేచి "అమ్మాయ్ మాణిక్యం! నర్సిగాడొస్తున్నాడు. అమ్మనీ, అమ్మాయినీ లెమ్మను" అంటూ లోపలకి నడిచారు.

"ఎప్పుడో తయారై రడీగానే వున్నాం. ఏమి తొందర మీరూను—" మహాలక్ష్మమ్మ దెప్పుతూనే వీధిలోకి నడిచింది

"బండొస్తోంది బండి" అంటూ వీధిలోంచి పరుగెత్తుకొచ్చాడు వాసు అందరితోపాటు తనూ వీధిలోకి నడిచింది వర్ధని

"ఏరా నర్సిగ! ఎందుకింత ఆలస్యమైంది?" మాధవరావుగారిలా ప్రశ్నవేస్తారని తెల్సి జవాబుకు సిద్ధపడే వచ్చిన నర్సిగాడు

"లేటునేదు బాబూ! ఓ క్షణం ఆలస్యమైందంతే తిండితిని, ఎడ్లకి నీళ్ళెట్టి బండిపూసి బయల్దేరినా నంతే."

ఏ కళనున్నారో మాధవరావుగారా ట్టే మాట్లాడదల్చుకోలేదు

"సర్లె సామానంతా బండిలో వెయ్యి" అంటూ భుజంమీది కండువా సవరించుకుని పొన్ను కర్రను చేతిలోకి తీసుకున్నారు.

బండి ఎక్కేముందు మహాలక్ష్మమ్మగారు మాణిక్యాన్ని పిలిచి "చూడమ్మా మాణిక్యం! ఇంటినీ పిల్లల్నీ జాగ్రత్తగా చూసుకో. నీకేమైనా కావలిస్తే నాన్నగార్కి ఉత్తరం రాయి. పిల్లల్ని రోజూ బడికి పంపు. ఇక వర్ధని గురించి నీకేం బెంగ అవసరం లేదు. దానికెప్పుడు చూడాలనిపిస్తే అప్పుడొస్తుంది. ఏరా!" అని చెప్పవలసినవన్నీ చెప్పారు

"పోనియ్యరా నర్సిగా! కాఫీల టైంకి అబ్బాయి దగ్గరకు పోవాలి" అంటూ నడిచారు మాధవరావుగారు. నర్సిగాడి అదిలింపుతో మువ్వలు కట్టిన మైసూరెడ్లు పరుగు లంఘించుకున్నాయి. గుమ్మంలో నిరాశగా నిల్చుని వర్ధనివైపే చూస్తూ చెయ్యి వూపింది ధనం బండి మలుపు తిరిగింది. ధనం కనుమరుగైనా ఆ మామిడిచెట్టు మాత్రం కన్పిస్తూనే వుంది. విశాలంగా పరుచుకున్న కొమ్మలు — గుబురుగా పెరిగిన ఆకులతో ఎన్నో రకాల పక్షులకు నిలయమైన ఆ చెట్టు ఎంతో శోభాయమానంగా కన్పించిందా క్షణాన

* * *

బండి గుంటూరు చేరేసర్కి మూడున్నర దాటింది. దోవకొసకూ నర్సిగాడిమీద విసుక్కుంటూనే వున్నారు మాధవరావుగారు. సావిట్లో కూర్చుని యేదో పిచ్చాపాటీలో మునిగివున్న వెంకట్రావుగారు వీధిలో బండి నిలవటం చూసి భార్యను కేకేసి వీధిలోకి వచ్చారు

"మేము వస్తున్నట్టు కబురందిందిరా?" వస్తూనే కొడుకును ప్రశ్నించారు మాధవరావుగారు.

"అందింది నాన్నగారు. ఈరోజు వుదయమే వస్తారని ఎదురు చూశాం. మరీ యీ ఎండలో బయల్దేరేరేం?"

"యేముందీ! మీ నాన్నగార్కి పదకొండయ్యేసర్కి భోజనముండాలని నీకు తెల్సుగదా! అందుకే అవన్నీ కానిచ్చే బయల్దేరాం" అంటూ చాపమీద నడుం వాల్చింది మహాలక్ష్మమ్మ.

"నా భోజనం మాటెత్తకపోతే తెమలలేవని చెప్పరాదూ" అంటూ కోడలివంక చూసి "యేమిటమ్మా — మాకోసం ప్రత్యేకించిగాని యేమన్నా చేసేవేమిటి? అసలే రైలు ప్రయాణం — వేడి చేసేసి నానా బాధా పడతాం నాకేం ఫర్వాలేదనుకో వుక్కుముక్కనే! ఎటొచ్చీ మీ అత్తగారే .." మాధవరావుగారి మాటలకు మధ్యలోనే అడ్డుతగిలి

"ఆయనను నువ్వేం బలవంతం చేయక్కరలేదమ్మాయ్! వద్దన్నాసరే ఆయన ఆవడలు విడిచిపెట్టేది లేదు" అంటూ పెరట్లోకి నడిచారు మహాలక్ష్మమ్మగారు.

"కొత్త చేస్తున్నావేమిటే కోడలా! లేలే! తొరగా మొహం కడుక్కుని రా!" అంటూ అక్కడే చాపమీద కూర్చుండిపోయిన వర్ధనివంక చూసి చెయ్యి పట్టుకు లేవనెత్తింది కనకం.

* * *

సాయంకాలం వాకిట్లో కూర్చుని పెద్ద కొడుకును దగ్గర కూర్చోబెట్టుకుని చెప్పవలసినదంతా చెప్పారు మాధవరావుగారు మాణిక్యమ్మ గురించి చెబుతూ "అల్లుడొస్తే ఓ కంట కనిబెట్టరా అబ్బాయ్! దాన్ని మాత్రం యేం అనకు. తరుచు వెళ్ళి చూసి వస్తుంటే దానికీ భయముండదు. ఈ ప్రయాణంవల్లనైనా వాళ్ళిద్దరూ కల్సి, కాపరం నిలబడితే అంతే చాలు."

తండ్రి మాటలు సాంతంగా విన్నారు వెంకట్రావుగారు.

ఆ సాయంత్రమంతా పెరట్లో పూలమొక్కల్ని చూస్తూ గడిపేసింది వర్ధని. మనసంతా దిగులుగా వుంది. రాత్రి భోజనాలయ్యాక బండెక్కితే ఉదయానికల్లా విశాఖపట్నం చేరుకుంటారు. కొన్నాళ్ళపాటు అక్కడి వాతావరణానికీ, అక్కడి పరిస్థితులకూ అలవాటుపడాలి. ముఖ్యంగా తన చదువు కొనసాగించుకోవాలి!

చీకటిపడేవరకూ ఆలోచనల్తోనే గడిపేసింది వర్ధని.

## 2

వెలుగును మించి చీకట్లు ఎక్కువయ్యాయి.

వేడిగాలిని వడగడుతూ దట్టంగా, జుట్టు విరబోసుకున్న స్త్రీలా వుంది వేపచెట్టు. రామకోవిల దగ్గరి పంచాయితీ రేడియోసెట్ లోంచి ప్రాంతీయ వార్తలు విన్పిస్తున్నాయి.

పెరటి తలుపు వేసి, హరికెన్ లాంతరు వెలిగించి, వీధి అరుగుమీద కూలబడింది మాణిక్యమ్మ. పిల్లలింకా ఆటనుంచి తిరిగి రాలేదు పొలాలనుంచి యిళ్ళకు తిరుగుముఖం పట్టిన కూలీనాలీ అంతా మాట్లాడుకుంటూ వెళ్ళిపోతున్నారు

వాళ్ళే నయం! పగలల్లా ఆడా మగా తేడా లేకుండా శ్రమిస్తారు. పొద్దుబోయే వేళకు యిల్లు జేరుకుని వుడుకునీళ్ళతో స్నానంచేసి నాలుగు మెతుకులు వుడకేసుకుని కడుపు నింపుకుని వాకిట్లో ఆరుబయట ఆకాశం క్రింద విశ్రాంతి పొందుతారు. వారి జీవితంలో సమస్యలుండవు! కలిగింది తింటారు ఆనందాన్ననుభవిస్తారు.

అలా జీవితం వెళ్ళిపోవడంకూడ ఎంత అదృష్టం?

"ఏటండి మాణిక్యమ్మగారూ! ఆలోచిస్తూ ఒక్కరే కూచున్నారూ" అంటూ కర్ర చప్పుడు చేసుకుంటూ వచ్చాడు బాబూరావు

బాబూరావు అవిటివాడు. చిన్నప్పుడు తనను పట్నం పంపించి చదివించలేదనీ ధర్నాఫారం తోనే చదువు ఆపివేశారని తలిదండ్రులమీద కోపమొచ్చి అలిగి నెలబావిలో దూకేస్తే చావుతప్పి కాలు విరిగిందని ఆ వూళ్ళో అంతా అనుకుంటారు. బాబూరావు తండ్రి వడ్రంగి వృత్తి చేసేవాడు కానీ బాబూరావు కటు మనసు మళ్ళలేదు. తల్లిదండ్రీ కొద్ది తేడాలోనే పోవడంతో, నా అన్నవారు లేక వంటరైపోయిన బాబూరావును చూస్తే ఆ వూళ్ళో అందరికీ జాలీ, అభిమానమూను

బాబూరావుకి పాఠాలు చెప్పడమంటే ఎంతో సరదా. అతనిలోని ఆ ఆసక్తిని గమనించిన ఆ వూరి కరణం తన పిల్లలకు రాత్రులు పాఠాలు చెప్పమని పురమాయించి నెలనెలా తృణమో ఫణమో ముట్టజెప్పేవాడు జీతాలు సరిగా యివ్వనందువల్లా, బడినీ బాగుపర్చటానికి చేసిన ప్రయత్నాలన్నీ వృథా అవటంవల్లా విసుగెత్తి క్రమశిక్షణలేని బడిలో చదువు చెప్పడమంత పాపం మరోటి లేదని నిర్ణయానికొచ్చారు ఆ వూరి మాస్టర్లు. ఆ నిర్ణయమే వారి జీవనోపాధిని ఒకవిధంగా మెరుగుపరిచిందని కూడ చెప్పొచ్చు పాదున కాసిన కాయగూరల దగ్గర నుంచి పాలూ పెరుగు వరకూ

## యువ

బి విద్యాసాగర్‌కి "మొరాలిటీ" "రియాలిటీ" …న్న చిత్రాలు "కార్టూన్" చిత్రాలు చూడ్డం సర్దాటకాని ఎక్కువగా సినిమాలు చూడడు అల్లూరి సీతారామరాజు నచ్చిన చిత్రం బి.కామ్. చదువుకుంటున్నాడు. జాతీయ క్రీడ లాంటిదేమైనా వుందేమో తెలీదన్నాడు వాళ్ళ కాలేజీలో వున్న లైబ్రరీకి తప్ప మరో లైబ్రరీకి వెళ్ళడు. కథలు చదవటంకన్నా వాటిమీద విమర్శలు చదవటం



"పూజ"లో సావిత్రి, వాణిశ్రీ

ఘట్టాలు, నవ్వించే దృశ్యాలు, ఏడుపు రప్పించే సన్నివేశాలు మోతాదులో వుండడంవల్ల, చిత్రం రక్తికట్టినట్టు చెప్పారు.

కవి ఆత్రేయ పాటల రచన, సత్యానంద్ మాటల రచన, మహదేవన్ సంగీతం పోటీపడ్డాయి అని అభిప్రాయపడ్డారు. కన్నప్ప ఛాయాగ్రహణం భలేగా వున్నదట. ఆదుర్తిగారి "స్పిరిట్" ప్రతి ఫ్రేములో అగుపిస్తుందట.

పాత్రధారులందరూ (మంజుల, అంజలీదేవి, కృష్ణకుమారి, జయమాలిని, కాంతారావు, ప్రభాకరరెడ్డి, మాడ) తూచినట్టు నటించారట.

ఇన్నాళ్లకు భట్ ఒక హిట్ చిత్రాన్ని నిర్మించారన్నది చూచినవాళ్లందరి ఏకగ్రీవ అభిప్రాయం.

## రామకృష్ణ ఎంత బాగున్నాడు !

ఏ. వి. ఎమ్. నిర్మాతలు రంగుల్లో నిర్మించిన "పూజ" చిత్రాన్ని వీక్షించిన విమర్శకులు రామకృష్ణ

## సత్యనారాయణ సుపర్బ్ !

గడుసరిగా పేరు గడించిన దాసరి "దేవుడే దిగివస్తే" చిత్రం రష్‌ను చూపించారు. చూచినంత వరకు, సత్యనారాయణ డామినేషన్ కొట్టొచ్చినట్టు కనిపించింది. ముఖ్యంగా "కృష్ణా, గెలుపు నీదే" అనేడి పాటకు, సత్యనారాయణ జీవం పోశారు. "ప్రేమనగర్" లోని "మనసు గతి యింతే" లాంటి పాటకు, సత్యనారాయణ ప్రాణం పోశారు.

చిత్ర చిత్రానికి ప్రేక్షకుల ఆత్మీయతను అందుకొంటున్న సత్యనారాయణకు "దేవుడే దిగివస్తే" మరో కిరీటాన్ని తెచ్చిపెట్టగలదు.

ఈ చిత్రంలో కృష్ణుడుగా నటించిన రామకృష్ణ ముద్దుగా, మురిపెంగా, ముచ్చటగా నటించారు. కృష్ణుడుగా తను సరితూగగలడని ప్రేక్షకులను ఒప్పించగలడు.

దాసరి రాసిన రాతలు, రమణీయంగా రసగుళికల్లా వున్నాయి. ఈ చిత్రానికి కన్నప్ప, బాలు, భాస్కరరాజు, సత్యం ముఖ్య సాంకేతిక సారథులు. చిత్రంలోని పాత్రలను అల్లురామలింగయ్య, చంద్రమోహన్, లక్ష్మీకాంత్, దేవిక, వాణి, జయప్రద పోషిస్తున్నారు.

"దేవుడే దిగివస్తే" చిత్రాన్ని అల్లు అరవింద, దాసరి సత్యనారాయణమూర్తి నిర్మిస్తున్నారు. "బంట్రోతు భార్య" కంటె, ఎక్కువ డబ్బును "దేవుడే దిగివస్తే" చిత్రం కంటుందేమో !

అనుభవం వున్న నటీనటుల కివ్వడం జరిగింది.

ఈ చిత్రం పూర్తిగా అవుట్‌డోర్‌లో జరుగుతుంది. స్టుడియోల ప్రమేయం లేనేలేదు.

"స్వర్గం — నరకం" అనేవి మనం సృష్టించుకున్న దాన్ని బట్టి, మనం చేసే పనులను బట్టి వర్తిస్తాయి అనేడి నిత్య నిజాన్ని సోదాహరణంగా చెప్పే సంఘటనల హారమే తను రాసిన యీ విచిత్రమైన కథ అని కథకుడు దాసరి చెప్పారు.

డిడ్డి శ్రీహరిరావు నిర్వహణలో తయారవుతున్న "స్వర్గం — నరకం" చిత్రానికి ప్రేక్షకాదరణ లభించగలిగితే, మరికొందరు కొత్తవాళ్లతో చిత్రాలను నిర్మించడానికి పూనుకోగలరు'

## స్వతంత్ర ఆర్ట్ పిక్చర్స్ !

మంచితనంతో, పనితనంతో, పరిశ్రమలో పేరు తెచ్చుకున్న స్టిల్ మోహన్ యిన్నేళ్ల తరువాత నిర్మాత హోదాను అందుకొన్నారు.

మోహన్‌కు బంగారురాజు తోడు అయ్యారు. ఇద్దరూ కలిసి స్థాపించిన సంస్థ పేరే "స్వతంత్ర ఆర్ట్స్ పిక్చర్స్."

ఈ సంస్థ నిర్మించబోయే చిత్రం యొక్క నాలుగు బాధ్యలను దాసరికి అప్పగించారు.

కథ, మాటలు, సినిమా అనుకరణ, దర్శకత్వంను నారాయణరావు చేపట్టారు.

"ఆడవాళ్లు - అపనిందలు"లో శుభ, కృష్ణంరాజు



లేదు గనక, సమస్యల వలయంలో చిక్కుకుని యున్న విద్యార్థులకు యీ చిత్రం నచ్చగలదేమో అనిపిస్తుంది.

ఈ చిత్రంలో ప్రభకు తన ప్రతిభను ప్రదర్శించ చెయ్యడానికి అవకాశం యివ్వబడింది. ఇచ్చిన పాత్రలో బలేగా చేసినట్టు వార్త.

హీరోగా రామకృష్ణ, సహాయ పాత్రధారులుగా ప్రభాకరరెడ్డి, కాంతారావు, సారథి, త్యాగరాజు, జ్యోతిలక్ష్మి, జయమాలిని, పి. ఆర్. వరలక్ష్మి, శ్రీదేవి నటించారు.

దుష్ట నాయకుడుగా దేవదాసు దంచేశాడు అని ఒకే ప్రచారం. (వర్తీ ఆర్టిస్ట్.)

"ఈ కాలపు పిల్లలు" చిత్రానికి పి. లక్ష్మీదీపక్ దర్శకుడు. సంగీతానికి సత్యం, ఛాయకు రామకృష్ణరావు, కళకు జి. వి. సుబ్బారావు సారథులు. ఈ చిత్రానికి దగ్గుబాటి భాస్కరరావు నిర్మాత.

## ఆడవాళ్ళు అపనిందలు

"నీ కెందుకీ శ్రమ"

"ఇది కూడా ఒక శ్రమేనా ?"

"నీకు కాకపోవచ్చేమొ ! కాని కడుపులో వున్న మనబ్బాయి మాటేమిటి ?"

"ఏమండి ? అబ్బాయంటున్నారు — అబ్బాయే పుడతాడని గ్యారంటీ ఏమిటి ?"

"గ్యారంటీగా పుట్టవలసిందే !"

"బాగుంది మీ పట్టుదల. అది మన చేతుల్లో ఎలా వుంటుంది ?"

"అదంతా నా కనవసరం. నువ్వు అబ్బాయిని అందివ్వాలిసిందే ! లేకపోతే బాబాయ్ వూరుకోడు"

ఆ మాటకు వసంత పక పక నవ్వుతుంది — మధు కూడా నవ్వులో నవ్వు కలుపుతాడు.

మైమరపించే యీ ఘట్టం శుభ చిత్రాలయ వారి "ఆడవాళ్ళు అపనిందలు" చిత్రంలోనిది. యిందులో కృష్ణంరాజు, శుభ నటించారు; యింకా జయంతి, గుమ్మడి, సుధీర్, ఎమ్. పి. ప్రసాద్, సాక్షి రంగారావు, నాగేష్ నటించారు.

మాటలు : దాసం గోపాలకృష్ణ, సంగీతం : జి. కె. వెంకటేష్, ఛాయాగ్రహణం : బి. యస్. ప్రకాష్, ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ : బి. మహేశ్వరప్ప, నిర్మాత : హెచ్. కె. చంద్రశేఖర్, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : బి. యస్. నారాయణ.

# సినిమా



"పడుచు పిల్ల—పగటి దొంగలు"లో జ్యోతిలక్ష్మి



"ధర్మాత్మ"లో రేఖ

### డి. బి. ఎస్. కు దాసరి దర్శకుడు

డి బి ఎస్ అధినేత నిర్మించిన చిత్రాలలో "దర్శా"కు లోటు వుండినట్టు ఎవరూ చెప్ప జాలరు "కాంప్రమైజ్" పదానికి డి బి నారాయణ నిఘంటువులో తావు లేదు

ఆయన అందించిన చిత్రాలలో ఒక్క "అబ్బాయిగారు — అమ్మాయిగారు" తప్ప మిగతా చిత్రాలన్నీ ప్రేక్షకులను ఆకర్షించిన మాట యదార్థమేగదా!

మంచి చిత్రాలను నిర్మించాలన్న తపన, తాపత్రయం వున్న డి బి ఎస్ కు, ప్రేక్షకులచేత మంచి దర్శకుడు అనిపించుకొంటున్న దాసరి దర్శకుడు గావడం యస్సెటేగదా?

### కృష్ణ ద్విపాత్రాభినయం!

డి బి ఎస్ తలపెట్టిన (కొత్త) వర్ణ చిత్రంలో వైవిధ్యం వున్న రెండు పాత్రలను కృష్ణ పోషించగలరు

డి బి ఎస్—డి ఎస్ ఆర్ కాంబినేషన్‌లో ఒక మంచి చిత్రాన్ని ఆశించవచ్చు

### చెక్కుచెదరని అభిమానం

చలనచిత్ర చరిత్రలో జమునకు వున్న స్థానం మరొకరికి వచ్చేదికాదు రాదు హీరో వర్‌షిప్‌తో సాగుతున్న చిత్ర రంగంలో జమున యిరవై అయిదేండ్లుగా హీరోయిన్‌గా ప్రకాశిస్తున్నదంటె, అనితర సాధ్యమంటారా?

ప్రజారంగంలో జమున పట్ల ప్రత్యేకమైన అభిమానం వుండబట్టే, యిన్నేళ్లు నాయికగా నటించగలిగింది

మహిళా లోకం జమున నటనకు నీరాజనం పడుతున్నది నిజం గాబట్టే, పవిత్రమైన పాత్రలు వచ్చినపుడు మొదటి ఛాయిస్‌గా పేర్కొనబడుతున్నది

నటిగా యిరవై నాలుగేండ్లు పూర్తయిన జమునను చూస్తే, యిరవై అయిదేండ్లు దాటిన యువతిగా కనిపించదు అని రాస్తే, అతిశయోక్తి అనుకుంటారేమో!

ఇప్పుడొస్తున్న కొత్త తారల అందరికన్నా, జమున అందంగా, చలాకీగా వుంటుంది అని చెప్పడానికి నేను సంశయించడం లేదు

### జమున నటన 'ఎ' వన్

వనజా మూవీస్‌వారి "వనజ—గిరిజ" చిత్రంలో జమున ద్విపాత్రాభినయం 'ఎ' వన్ అంటున్నారు. రెండుజన్మల నాయికగా, రెండుపాత్రల వైవిధ్యస్వభావాన్ని జమున అసమానంగా ప్రదర్శించినట్టు వార్త

డాక్టర్ జమునగా హుందాతనాన్ని, సహనాన్ని, అమాయకపు జమునగా ఆ పాత్ర స్వభావాన్ని ఎంతో నైపుణ్యంతో నటించారట

"వనజ — గిరిజ" చిత్రాన్ని నిర్మించిన ఇ కుప్పస్వామికి, దర్శకత్వం నెరపిన గౌతమ్‌కు "జమున" పేయింగ్ పాయింట్ కాగలదు

"వనజ—గిరిజ" చిత్రం గాక, "బాలనాగమ్మ, మంచిరోజు, శ్రీ గౌతమ్ పిక్చర్స్, అదిత్య చిత్ర" చిత్రాలలో జమున ధరిస్తున్న పాత్రలలో స్పెషాలిటి వుండగలదు

ప్రజలలో "స్పెషల్ రెస్పెక్ట్" నార్జించిన జమున "స్పెషల్ గ్రిప్" వున్న పాత్రలను మాత్రమే అంగీకరించగలదు

### తెలుగు తెరకు కొత్త దర్శకుడు

వర్తి వున్న దాసరి దగ్గర శిష్యరికం చేసిన కోటారెడ్డి యొక్క పనితనాన్ని పసిగట్టిన రామచంద్ర మొదలియార్ అనెడి తమిళ సోదరుడు, అతడికి దర్శకత్వం అప్పగించారు

"విజయానంద్ పిక్చర్స్" అని మొదలియార్ తన సంస్థకు పేరు పెట్టారు క్యారెక్టర్ నటుడు సత్యనారాయణ ప్రధాన పాత్రను పోషించగలరు

రాబోయే అక్టోబరులో షూటింగు ఆరంభం అవుతుందని తెలిసింది.

కొత్త బాధ్యతను స్వీకరించబోయే కోటారెడ్డి తన పదవికి పేరు తేగల సామర్థ్యాన్ని తను బడసియున్నాడు

దాసరి నేర్పిన పాఠాలు వృధా గాకుండా, తన మేధా సంపత్తిని జతపర్చి, కోటారెడ్డి కొత్త రుచిని చవిచూపించాలి



"బలిపీఠం"లో ఒక దృశ్యం



‘‘సొగ్గాడు’’లో జయచిత్ర

## తెలుగు వాసన వున్న తమిళ చిత్రం

ఈమధ్య మదరాసు ‘‘కమల’’ థియేటర్లో ఒక తమిళ చిత్రాన్ని చూశాను. చిత్రం పేరు ‘‘మయన్‌గిగి రాళ్ ఒరుమాదు’’ చిత్రం చూస్తున్నంతసేపు, తెలుగుదనం వున్న ఒక చిత్రాన్ని చూచినట్టు ఫీలయ్యాను. ఆ చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తే, ప్రజాదరణ పొందగలదని భావించాను.

ఆ కథను తెలుగులో నిర్మించే హక్కును ఎమ్. రవీంద్రనాథ్ పొందారని తెలిసింది. ఆయన్ను రవిశంకర్ ఆఫీసులో కలిశాను. మంచి కథను ఎన్నుకొన్నందుకు అభినందించాను.

‘‘ఉత్తమురాలు’’లో ఒక దృశ్యం



## శ్యామ్‌ప్రసాద్ పిక్చర్స్

ఆయన నిర్మించే ‘‘మయన్‌గిగి రాళ్ ఒరుమాదు’’ చిత్రం యీ బ్యానర్‌పై తయారు కాగలదని, సినిమా అనువాదం, సంభాషణం, దర్శకత్వంను దాసరి అంగీకరించారని తెలుసుకొన్నాను.

తమిళ చిత్రంలో నటించిన ‘‘సుజాత’’కు తెలుగు రాదన్న మాట వాస్తవమే అయినా, ఆమె నటించినట్టు తెలుగులో చెయ్యగల సామర్థ్యత ఒక్క లక్ష్మికి-మాత్రమే గలదు.

## స్వస్థలంలో షూటింగు

ప్రముఖ నిర్మాత డి. రామానాయుడు రంగుల్లో నిర్మిస్తున్న ‘‘సొగ్గాడు’’ చిత్రం తాలుకు కొంత షూటింగును తన స్వస్థలమైన ‘‘కారంచేడు’’లో జరిపారు.

జులై మొదటి వారం కారంచేడు గ్రామం కళాకారుల నివాసమై, వేలమందిని కొత్త రూపంలో ఆకర్షించింది.

‘‘అందాల రాజు’’ శోభన్, గ్లామర్ రాణి జయసుధ పాల్గొన్న దృశ్యాలను, దర్శకుడు బాపయ్య చిత్రీకరించారు.

‘‘హీ-మాన్’’ ది ‘‘సొగ్గాడు’’ చిత్రంలో వెరైటీ వేషం. ‘‘ప్యాంటు, సూటు, బూటు’’ ధరించనవసరంలేని పాత్ర. గ్రామ సంక్షేమాన్ని, ప్రజాభ్యుదయాన్ని ఆశించే పాత్ర.

ఈ చిత్రంలో శోభన్‌కు జవరాలుగా జయచిత్ర నటిస్తున్నది. సహాయ పాత్రలను అంజలీదేవి, రాజబాబు, నాగేష్, మంజుభార్గవి, అల్లు రామలింగయ్య మరియు సత్యనారాయణ పోషిస్తున్నారు. మహదేవన్, విన్సెంట్, జి. వి. సుబ్బారావు ముఖ్య సాంకేతిక సారధులు.

## అన్నిటికి ఆదరణ!

సమత ఆర్ట్స్ వారి ‘‘జేబుదొంగ’’ చిత్రంపై ప్రేక్షకులు పెద్ద హోప్ పెట్టుకొని యున్నారు. టైటిల్‌ను బట్టి, యిదొక ‘క్రైమ్ థ్రిల్లర్’ అని కొందరికి అనుమానంకూడా లేకపోలేదు.

అలాంటి అనుమానం నిజమా, కాదా అని తెలుసుకుందామని, నిర్మాత, కథకుడు చటర్జీగారిని కలిశాను. ‘‘క్రైమ్, సెంటిమెంట్, రొమాన్స్, హాస్యం’’ కలబోసిన కుటుంబ కథ అని ఆయన చెప్పారు.

మరొక నిజాన్ని ఆయన వెల్లడించారు. ‘‘జేబుదొంగ’’ వర్ణ చిత్రం తాలూకు పాటలన్నీ హాట్‌కేకుల్లా అమ్ముడయిన వివరాలను తెలుసుకొన్నాను. ఈ చిత్రానికి చక్రవర్తి సంగీత దర్శకుడు.

‘‘జేబు దొంగ’’గా శోభన్‌బాబు అన్ని తరగతుల ప్రేక్షకులను దోచుకునే విధంగా నటించాడు. గ్లామర్‌కు మంజుల వుండనే వుంది. దర్శకుడు విక్టరీ, ఛాయకు వెంకటరత్నం వుండ, వాటి గూర్చి దిగులేల? ఈ చిత్రాన్ని చటర్జీ, యాచేంద్ర నిర్మించారు.

## డిమాండ్ వున్న దర్శకులు!

ప్రజల్లో వున్న పలుకుబడినిబట్టి, పరిశ్రమలో పనులు జరుగుతుంటాయి.

ఎవరికయితె పాపులారిటి వుంటుందో, అట్టి వారినే పరిశ్రమ ప్రేమిస్తుంది.

తెలుగు చిత్ర పరిశ్రమలో డిమాండ్ వున్న దర్శకులు నలుగురే కనిపిస్తున్నారు. ఆ నలుగురు కూడా ప్రతిభతో, కృషితో వున్నత స్థితిని అందుకొన్నారన్నది జగమెరిగిన సత్యము.

ఆదుర్తి, విక్టరీ, విశ్వనాథ్, దాసరిగార్లకు అటు ప్రేక్షకుల్లో, యిటు పరిశ్రమలో సమాన గౌరవం, విలువ వున్నాయి.

మారుతున్న ప్రజల అభిరుచులకు అనుగుణంగా, చిత్రాలను అందించగల అర్హత నే పేర్కొన్న నలుగురికే వున్నది.

తదితరులకు లేదనికాదు; వుండికూడా, అదృష్టం కలిసిరాకపోతె ఎవరేం చెయ్యగలరు?

— శ్రీనివాస్



‘‘జేబు దొంగ’’లో శోభన్, మంజుల

# డాక్టర్ సలహాలు

కె. ఎస్. ఎస్. ఎమ్. – పేరంకిలాకు

నా వయస్సు 12 సం.లు నా కుడిస్తనం కాశీరేగికాయంత వాచింది. అప్పుడప్పుడూ నొప్పిగా వుండును. అది తగ్గటానికి ఏ మందులు వాడమంటారు?

★ కొందరికి ఇలా కాయలులాగా స్తనాలలో ఏర్పడటం, మరికొందరికి మామూలుగానే ఇటువంటి కాయలు పుట్టినప్పటి నుంచీ ఉండటం తరచూ వైద్యులకు తటస్థపడటం సహజమే!

వీటిని "ఫైబ్రో అడినోమా" అని అంటారు. స్తనములలో చిక్కెలుకలాగా, ఆ ప్రదేశమంతా సులువుగా ఈ "కాయ" వంటి వాటిని కదపగలగటం — ఈ రోగ ప్రధాన లక్షణం. అందుకే ఈ రోగాన్ని ఆంగ్లంలో "బ్రెస్ట్‌మౌస్" (మట్స్) అంటారు. వీటి నివారణకు, శస్త్ర చికిత్స మాత్రమే సరిఅయిన మార్గం. మందులు – మాకులు వాడటం తద్వారా ఎవరైనా ఫలితం ఉందని చెప్పినా — తమ ఆత్మ సంతృప్తికై వాడటం మినహా ఫలితం లేదు.

ఏ. ఎఫ్. ఏ. ఆర్. ఎ. – ఖర్గపూర్

మా నాన్న వయస్సు 50 ఏండ్లు. 20 ఏళ్ళ నుండి ఉబ్బసము వున్నది. ఎన్ని మందులు వాడినను తగ్గుటలేదు.

★ ఉబ్బసం వ్యాధి అనేది ఎక్కువగా ఉంటే (చాలా కాలంగా) అది, క్రానిక్ బ్రాంకైటిస్‌గాని, లేక ఆస్తమాగాని అయిఉండవచ్చును.

మీ నాన్నగారి వయస్సు, పై రోగ లక్షణాలు ఉన్న కాలం, దృష్ట్యా, మందులు వాడినంత మాత్రాన — చేతితో తీసివేసినట్లు రోగం నయమవటం — అవుతుందనుకోవటం — పొరపాటు.

ఆయనగారికి, ఎటువంటి మందులు వాడినా తాత్కాలిక ఉపశమనం మాత్రమే కలుగజేస్తాయి.

ఈ ఉబ్బసం రావటానికి, మామూలుగా ఉండే దినసరి ఆహార వ్యవహారాలలో లేక వాతావరణంలో మార్పులకీ – గనక సంబంధం ఉందని రోగికి తెలిసే ఉంటుంది. అటువంటి ప్రోద్భల పరిస్థితులు ఏర్పడకుండా చూసుకోవటం ఉత్తమం.

జి. ఎస్. ఎమ్. – కడప

మాకు 7వ నెలలోనే పిల్లవాడు పుట్టినాడు. ఆ పిల్లవాడిని గురించి తీసుకొనవలసిన జాగ్రత్తలు వ్రాయండి.

★ ఏడవ నెలలో పిల్లలు పుడితే వారి బరువు 2.5 (కేజీ) లకు తక్కువ ఉంటే – వారిని "ప్రిమెచూర్ బేబీ" అంటారు. ఇలా బరువు తక్కువగా పుట్టిన పిల్లలకు వైద్య సహాయంకన్నా, నర్సుల పర్యవేక్షణ అవసరం. నర్సులంటే ఏదో 'బురఖా' వంటి యూనిఫాం వేసుకొన్నవారే కాదు! అదేదో "ఆలనా – పాలనా" అంటారే, నీళ్ళు పోయటం దగ్గరనుంచి, తగిన పరిమాణంలో పాలు పట్టడం, శరీర ఉష్ణోగ్రతను గమనించడం. ఇతరులను శిశువుల వద్దకు రానీయకపోవటం, ఆహారం మింగలేని శిశువులకు ముక్కుద్వారా గొట్టం పోనిచ్చి పాలు ఇవ్వడం మొదలయిన సపర్యలు చేయగలవారు చాలా అవసరం.

పైన వ్రాసినవే తీసుకోవలసిన జాగ్రత్తలు — (బరువు 2.5 కె. జి. లకు వచ్చేదాకా)

పి. ఆర్. – కాకినాడ

నాకు నిద్రలో పండ్లుకొరికే అలవాటు వున్నది. ఎందువలన వస్తుంది? దీని నివారణోపాయము తెల్పండి.

★ మామూలుగా కలలు అనేవి వస్తే — దాదాపు ఏదో సినిమా చూసినట్లు — నిద్రించేవారు ప్రేక్షకులుగా మిగిలిపోతారు. అందువలన అందరికీ కలలనేవి, వచ్చినా, బాహాటంగా వెలుపలికి తెలియటం కాని కొందరు ఈ కలలవల్ల, ఆ కలలోని సన్నివేశాన్ని బట్టి అరవటమో, లేచి నడవటమో, లేక ఉద్రేక పూరితమైన కలలు వస్తే — పళ్ళు కొరకటమో చేస్తారు.

దీనికి ప్రత్యేక చికిత్స అవసరంలేదు. ప్రతి నిత్యం మనం — నిద్రలో ఇలా చేస్తామే అని బాధ పడుతేనో, లేక ఇతరులు అలా చేస్తావని ఎగతాళి చేస్తేనో ఎక్కువ అవుతుంది. ఏమీ జరగనట్లే ఉంటే క్రమేపీ తగ్గిపోతుంది.

జె. బి. – చిత్తూరు

నాకు అప్పుడప్పుడు దగ్గు వస్తుంటుంది. 4 సం.ల క్రితం డాక్టర్లు 'యిస్నోఫీలియా' అని అన్నారు. చలికాలంలో రాత్రులందు విపరీతముగా వచ్చి ఆయాసం ఎక్కువగా వస్తున్నది. దగ్గుతో పాటు తుమ్ములుగూడా ఎక్కువగా వస్తాయి. మందులు వేసుకున్నపుడు రాత్రంతా నిద్ర రాక వళ్ళంతా పొడిపొడిగా వుండి, కాళ్ళల్లో సత్తువ లేనట్లు వుంటుంది. ఇది ఎందువలన?

"యిస్నోఫీలియా" అనేది రాను రాను — నాగరకతగా వాడబడే రోగం పేరు అయిపోయింది. ఇది ఒక లక్షణం — అంటే నెత్తురులోని తెల్లకణములలో ఒకటైన "యిస్నోసిల్స్" తమ మామూలు సంఖ్యకన్న ఎక్కువగా ఉండటమే! ఇది ఎక్కువ అవటానికి శరీరంలో కొన్ని క్రిములకు, మన శరీరంలోని రక్షణా విభాగాలకు — జరిగే అంతర్యుద్ధమే కారణం.

ఎక్స్–రే, కఫం, ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం – శరీర ఉష్ణోగ్రత చూడటం — దానిని గుర్తించడం — వీటి ఫలితాలను వైద్యులకు చూపించి తగిన సలహా పొందటం ఉత్తమం. కాళ్ళు లాగటం, రోగ లక్షణంవల్ల, ఆహార లోపంవలన మాత్రమే!

— *డా॥ కె. వెంకటేశ్వరరావు*
















# మీరు చవిచూసే ప్రతి హనీ బీ బ్రాంది గుటకలోనూ ఫ్రాన్సు యొక్క చిన్నభాగం ఉంది

ఎంకోరిన ఫ్రెంచి, భారతదేశపు ద్రాక్షపళ్ళ బ్రాందీలలోంచి ఉత్కృష్టంగా బ్లెండు చేయబడినది.



హనీ బీ బ్రాందీ చవిచూడండి
ఒక్క సారి ఫ్రాన్సుకి వెళ్ళిన అనుభవాన్ని పొందండి

## హనీ బీ బ్రాంది

ఆ ఫ్రెంచి అనుభూతి కోసం!



"మార్కెట్ చేయువారు హెర్ బర్ట్ సన్స్ లిమిటెడ్"
"బాటిల్ చేయువారు మేక్ డొవెల్ డిస్టిలరీస్"




గుమ్మంలో కారాగిన శబ్దానికి ఎవర య్యుంటారా? అని కిటికీలోంచి తొంగిచూసింది రాధ. ఆగిన కారులోంచి దిగుతున్న శాస్త్రిగార్ని చూసి— "అరె! రాజ్యం నాన్నగారు" అనుకుంది. శాస్త్రి గారు రాజ్యానికి నాన్నగారే కాక — ఆ జిల్లాకు కలెక్టరు కూడా నన్న విషయం రాధకు తెలియకపోలేదు. కాని — ఆ వేళప్పుడు ఆయన తమయింటికి ఎందుకు వచ్చారన్న సంగతి మాత్రం ఆ పిల్లకు ఆ క్షణంలో తెలియలేదు.

వరండాలో వాలుకుర్చీలో కూచుని పేపరు చదువుకుంటున్న సుబ్రహ్మణ్యంగారు కూడా కారాగిన చప్పుడికి తలెత్తక తప్పలేదు. కారు దిగి లోపలికొస్తున్న శాస్త్రిగారి నిదివరకు ఆయన చూడకపోలేదు. ఆయనెవరన్న సంగతి తెలుసుకన్నా — అంతటివాడు తన యింటికి వచ్చాడన్న ఆనందంకన్న, ఎందుకొచ్చాడన్న ఆశ్చర్యం ఎక్కువయ్యింది ఆయనకు దాని నుంచి ఆయన తేరుకోకమునుపే శాస్త్రిగారు వరండాను చేరుకున్నారు. ఇపుడు ఆశ్చర్యం స్థానే అతిది మర్యాద చోటు చేసుకుంది. సంభ్రమంతో ఎదురువెళ్ళి — స్వాగతం చెప్పా రాయనకు.

శాస్త్రిగారు మందీ మార్బలంతో రాలేదు. ఒంటరిగానే వచ్చారు. వస్తూనే ఎన్నాళ్ళ నుంచో ఎరుగున్న చుట్టంలాగా మాటలు మొదలుపెట్టారు మనం — మనం ఒక ప్రాంతం వాళ్ళమేనన్నారు. ఎక్కడిదో బంధుత్వం ఏకరువుపెట్టారు. వారితల్లిగారు వీరి తల్లిగారి తరుపు చుట్టమని తేలింది. ఆమెగారీమధ్య యిక్కడికి వచ్చినపుడీసంగతి తెలిసిందనీ - కార్యార్థినై వచ్చాననీ అన్నారు.

సుబ్రహ్మణ్యంగారుకూడా శాస్త్రిగారి వాక్ప్రవాహానికి ఆనకట్ట వెయ్యలేదు. ఎందుకంటే ప్రస్తుతం ఆయిన తన ఆనందాన్ని ఆదుపులో పెట్టుకోవలసి ఉంది. కలెక్టరంతటివాడు తన యింటికి వచ్చి- కార్యార్థినై వచ్చాననీ — కొడుక్కి కన్యాదానం చేస్తాననీ అంటూంటే ఆనందం అవధులు దాటడం లసహజం కాదు? అయితే, అది బయటపడితే బాగుండదు

జిల్లా కలెక్టరు తమశాఖవాడేననీ— మంచి నిజాయితీ పరుడనీ - విని ఉన్నా, యింత బోళామనిషనీ బంధుప్రీతి కలవాడనీ యింత వరకూ ఆయనకు తెలియదు. కొడుక్కి పిల్లనిస్తానంటూ వచ్చిన ఆయన్ను చూస్తే— "యితను పొరపడటం లేదుకదా? మా స్థితి

## వారఫలం

మహేష్

25-7-1975 శుక్రవారం మొదలు
31-7-1975 గురువారం వరకు

మేషం :— ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

వృషభం :— వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాటివారిలో గౌరవం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు— దైవ కార్యాలు నెరవేరతాయి. అధిక వ్యయం జరుగుతుంది.

మిధునం :— మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. అధికారుల వల్ల జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మీరు యిది వరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

కర్కాటకం:— ఫలితం లేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

సింహం :— ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాటి వారిలో గౌరవం లభిస్తుంది.

కన్య :— మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగు

గతులు తెలిసే వచ్చాడా ?'' అని అనుమానం వేసింది. ఒకవేళ ఆయనకు తెలియకపోయినా తెలియపర్చ వలసిన బాధ్యత తనదీ అనుకున్నారు.

ఇంతలోనే అహం మేల్కొంది. మాకు మట్టుకు ఏంతక్కువ ? రెండు మూడు జిల్లాలకు పేరుమోసిన వంశం. ఫలానావారి కుటుంబం అంటే ఎవరయినా సరే ఓహో అనవలసిందేగాని — మరోలా అనేందుకు వీలులేదు.

అయినా ఎంత పేరుమోసిన వంశమయినా తాను ఆంధ్రాబ్యాంకులో ఎకౌంటెంట్‌ను మాత్రమేననీ యిద్దరు పెళ్ళి కావలసిన ఆడపిల్లలకూ నలుగురు మగపిల్లలకూ తండ్రిననీ తన తరువాత యీ కాడినెత్త వలసిన వాడయిన పెద్దకొడుకు రామానికే యిప్పుడీయన పిల్లనీయ వచ్చాడనీ ఆయన మరిచిపోలేదు.

అందుకే తమ స్థితిగతులూ — బరువు బాధ్యతలూ మరోసారి విపులంగా చెప్పారు. ఆలోచించు కోండన్నట్లు. అందుకు శాస్త్రిగారు ముందు ఫెళ్ళున నవ్వారు. తర్వాత న్నారు. 'నాకన్నీ తెలుసునండీ బావగారూ! ఇవన్నీ వాకబు చేశాకే మీదగ్గిరకు వచ్చాను. నాకు మీ సంబంధం చాలా నచ్చింది. ఆమధ్య మీవాణ్ణి క్లబ్‌లో చూశాను చాకులాంటి కుర్రాడు. తప్పకుండా పైకొస్తాడు.'' కాస్సే పొగిడాయన.

''అసలు సంగచ్చెప్పనా బావగారూ! నాకున్నది ఒకతే పిల్ల. యింక వెనకా — ముందూ ఎవరూలేరు. ముందు ముందు జీవితంలో కూడా దీనికి వెనకా, ముందూ ఎవరూ ఉండరనుకుంటే నా కష్టం తోస్తోంది. అందుకే కాస్త అయిన కుటుంబంలో చూసి — నలుగురున్న యింట్లోనే యిద్దామనుంది. అది కూడా జనంవాపి పిల్ల. ఇంట్లో ఒక్కత్తీ బిక్కు బిక్కుమంటూ ఉంటుందేమో జనం అంటే మొహం వాచి పోయి ఉంటుంది'' ఓ సారి కూతుర్ని గుర్తు చేసుకున్నాడాయన.

లాంఛనంగా ఆయన ఒకసారి కూతుర్ని గురించిన వివరాలు చెప్పాడు కాని - న్యాయానికి అది అనవసరం. రాజ్యంగురించి యింటెల్లిపాదికీ తెలుసు. ఎంచడానికి వీల్లేని పిల్ల. కాని. యిక్కడ యింకో చిక్కు వచ్చి పడింది సుబ్రహ్మణ్యంగార్కి. వచ్చిన సంబంధవేమో లక్షణమయినది. కాదనడానికి వీల్లేనిది. కళ్ల కద్దుకోవలసింది. కాని-కొడుకేమో చెల్లెళ్ల పెళ్ళిళ్ళయితే గాని-తన మాట ఎత్తద్దని భీష్మించుక్కూచున్నాడు. ఆ మాటఆయనతో ఎలా చెప్పడం? తీరా చేసి ఆ విషయం చెబితే మగ పెళ్లివారి బెట్టు చూపిస్తున్నాం అనుకుంటాడేమో! సిగ్గుతో ఆయన ప్రాణం చితికి పోయింది. కాని, తప్పదు. మెల్లిగా నసుగుతూ ఆ విషయం బయట పెట్టాడు.

అది విని శాస్త్రిగారు మళ్లీ యింకోసారి ఫెళ్ళున నవ్వారు. అదయ్యాక, ''భలేవారండి మీరూ! పిల్లనిస్తానన్నాను గాని-తక్షణం పెళ్ళి చేయండని పట్టు పట్టానా నేను! అలాగే కానిద్దాం. అమ్మాయిల పెళ్లిళ్ళయ్యాకే చెయ్యొచ్చు. ముందు మనం మాత్రం శుభం అనుకుంటే తెరిపి నాకు'' అన్నారు.

అప్పుడు సుబ్రహ్మణ్యంగారు హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. ఈ లోగా సంగతి తెలిసిన ఆడవాళ్లు సంతోషంతో సగం-సగం సంభాషణలువింటూ—చెవులిటూ- చేతులటూ పడేసి- చకచకా కాఫీ చేసి పంపించారు. ఏ మాత్రం సంకోచం లేకుండా శాస్త్రిగారది సేవించి— బయటికి వచ్చిన బామ్మగారితో బంధుత్వాలు తిరగేసి-చాలా సేపు ఖబుర్లు చెప్పి శలవు తీసుకున్నారు.

ఈ మాటు శలవులకు రామంవచ్చినప్పుడు రాజ్యాన్ని చూపించి సంబంధాన్ని స్థిరపరచుకో వాలని నిశ్చయించారు.

ఇంటిల్లిపాదికీ యీ ప్రస్తావన ఆనందాన్ని కలుగజేసింది. రాజ్యం రాధ స్నేహితురాలు. ఆ పిల్ల కూతురుతో తమ యింటికి వచ్చినప్పుడల్లా — బంగారబ్బొమ్మలాగుంది — దీపంలాంటి పిల్ల — చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఏ యింటి కోడలౌతుందో'' అని మురిసిపోయే రాధ తల్లి, ఆ యింటికే ఆ పిల్ల తన కోడలుగా వస్తుందని తెలుసుకున్నప్పుడు ఆశించని అదృష్టాన్ని అందుకున్నట్టుగా ఆనందించింది.

సాంప్రదాయమయిన కుటుంబాల మీద సదభిప్రాయం—పెద్ద కుటుంబంఅన్న గౌరవం లేకపోతే శాస్త్రిగారు అసలా సంబంధానికి రావలసిన అవసరంలేదు. బామ్మగారు కూడా ఆ సంగతి గ్రహించారు. వీటితోపాటు ఆయనకున్న బంధుప్రీతి ఆవిడకు ముచ్చట గొలిపింది. పిల్లదానిక్కూడా తండ్రి పోలికే వస్తే బుద్ధిమంతురాలే ఔతుంది. అణకువ గల ఆడపిల్ల యింటికోడలయితే ఆ అదృష్టం యింట్లో వాళ్లందరిదీనూ. అనుకున్నారావిడ.

సుబ్రహ్మణ్యంగారికితెలుసు. ఆ సంబంధం

---

తుంది. రావలసిన డబ్బు అందగదు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**తుల :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం —** మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవపం బాగుంటుంది.వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి.వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**కుంభం :** మీ కార్యక్రమాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి: రావలసినడబ్బు అందుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. పోటీదారిలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపుతారు. స్త్రీలకు— కుటుంబ [illegible] బాగుంటాయి. మీ [illegible]







రావడానికి కొడుకు సప్త ద్రూపం — నాలుగంకెల జీతం — ముఖ్య కారణాలని. అందుకే తన ప్రయోజకత్వానికీ, కొడుకు ప్రయోజకత్వానికీ విలాసంగా చిరునవ్వు నవ్వుకున్నారాయన.

ఆ విధంగా సౌందర్యం - సౌజన్యం రూపు దాల్చిన రాజ్యం ఆయిటికి పెద్ద కోడలుగా వస్తున్నందుకు యింటిల్లిపాదీ సంతోషించారు. ఒక్క రాధ తప్ప.

మరోప్పుడయితే రాధ కూడా అంతగానో —మరింతగానో ఎంతగానో అంతగా సంతోషించే ఉండేది. కాని యిప్పటి పరిస్థితి వేరు. రామానికి రాజ్యాన్ని యిస్తామంటున్నారని తెలిసినప్పుడు రాధకి ఆనందం కలుగలేదు. "అల్లుడి నోట్లో శని" అన్న సామెత గుర్తుకొచ్చింది.

రాధ కిప్పుడు ఓ పెద్ద సమస్య వచ్చి పడింది. ఆ పిల్లకి యీ సమస్య ఎలా పరిష్కరించుకోవాలో తెలియలేదు. కాని ఒక్కటిమాత్రం తెలుసు ఈ పెళ్లికి అన్నయ్య చచ్చినా ఒప్పుకోడు.

మరో రెండు నెలల్లో శలవులకు అన్నయ్య వస్తాడు. అప్పుడు వాళ్లడుగుతారు. పెళ్ళి గురించి యిప్పుడు కాదంటాడు. చెల్లెళ్ళ పెళ్ళిళ్ళవాలంటాడు అలాగే కానిద్దాం. ముందు రాజ్యాన్నిచూసి లాంఛనంగా "సరే" అనుకుందాం అంటారు. రాజ్యాన్నిచూస్తే కాదనడానికి కారణం కనిపించదు అప్పుడా బెంగాలీపిల్ల విషయం బయట పెట్టకతప్పదు. పెడితే రాద్ధాంతవూ తప్పదూ! అవును. అసలీ బెంగాలీ పిల్లవల్లే యీ రాద్ధాంతం అంతామా! ఆలోచిస్తున్న రాధకి ఆ రోజు ఆ బెంగాలీ పిల్ల ఫోటో చూడటం గుర్తుకొచ్చింది.

## ఘటన

* * *

చాలామంది అమ్మాయిల్లాగే రాధకూడా అమితమయిన అభిమానం : తెలిసీ తెలియని వయసులో ఏ అమ్మాయినయినా సరే "ఈ సృష్టిలో కెల్లా ఉత్తమ పురుషుడెవరు ? 'అని ప్రశ్నించి చూడండి. నూటికి తొంభై మంది "వెంకటికి · శ్రీరామచంద్రుడు ప్రస్తుతం మా అన్నయ్య 'అని జవాబిస్తారు. మిగిలిన పదిమందీ శ్రీరామచంద్రుడి మాట కూడా ఎత్తరు · అన్నయ్యంటే ప్రతి ఆడపిల్లకీ ఆ వయసులో ప్రత్యేకమయిన ఓ అభిమానం ఉంటుంది లోకానికంతకీ ఆదర్శప్రాయుడు వాళ్ళ అన్నయ్యే అనిపిస్తుంది. ప్రపంచాన్ని గురించిన వీళ్ళ అభిప్రాయాలు చాలామటుక్కు వీళ్ళ తాలూకు అన్నయ్యవే అయ్యుంటాయి.

రాధ కూడా మధ్య తరగతి మనస్తత్వం గల ఆడపిల్లే అన్నయ్యంటే అమితమయిన అభిమానం వుంది అన్నయ్య ముందెప్పుడూ "అన్నా నీ అనురాగం! ఎన్నో జన్మల పుణ్యఫలం" అనకపోయినా, "అన్నయ్య సన్నిధీ అదే నాకు పెన్నిధీ" అనిఎలుగెత్తి పాడక పోయినా ఆ పిల్ల మనసు వాళ్లన్నయ్యకు ఒక సాఫ్ట్ కార్నర్ ఉంది అవసరాన్నిబట్టిఅది స్పందిస్తూ ఉంటుంది.

అలాంటి రాధ ఆవేళ అన్నయ్య జేబులో ఆ అమ్మాయి ఫోటో చూసింది. ముందు యిదేంటి ? అన్నయ్య జేబులో అమ్మాయి ఫోటో ? అని ఆశ్చర్యపోయింది. కాస్త—ఆగి ఆలోచిస్తే అమ్మాయి ఫోటోగాక—అబ్బాయి ఫోటో ఉంటుందేమిటి ? రైటే అమ్మాయి ఫోటో అందునా అందమయిన అమ్మాయి ఫోటో ఉండటమే కరెక్టనిపించింది.

అప్పుడా పిల్లకింకో అనుమానం వచ్చింది. ఇదుత్తి జేబులో బొమ్మేనా ? మనసులో బొమ్మ కూడానా ? అని. అనవసరంగా తను అపార్థం చేసుకోవటం లేదుకదా ? తెలుగు సినిమాలూ — నవలలూ తెగచూసి — చదివిన రాధకు అపార్థాల సీనులూ వాటి తాలూకు మాలూ మనస్సుకి గాఢంగా హత్తుకు పోయాయి. అందుకే ఎందుకయినా మంచిది. యీ జేబులోబొమ్మను గురించి ఓ నిర్ణయానికి వచ్చేముందు అన్నయ్యనోసారి కదిపి చూడాలనుకుంది.

అన్నయ్యకోసం చూస్తే కనిపించలేదు. కాని అమ్మ పెడుతున్న కేకలు మాత్రం వినిపిస్తున్నాయ్! 'చిల్లరడబ్బులు పట్టావే అంటే అంతసేపేవిటే ? ఏం చూస్తున్నా వక్కడ చోద్యం ?" అంటూనూ. "చోద్యమే చూస్తున్నాను. చాలా హృద్యమయిన చోద్యం" అందామనుకుంది. కాని, డొంక కదులుతుం దన్న భయంతో తీగ లాగలేదు. అప్పుడు గుర్తుకొచ్చింది. గుమ్మంలో కూరలవాడి నుంచి—చిల్లరుందేమోని వెతకబోవడం, — తీరాచేసి—, వెతకబోవని తీగ ఎదురయ్యింది, పర్స్ మడిచేసి జేబులో పెట్టేసింది. పర్సు కొనుక్కునేది చిల్లర పెట్టుకోడానికి కాదన్న నీతిని గ్రహించాక.

రాధ అన్నయ్య వాళ్ల బొమ్మ బొసలో దేశంకాని దేశంలో పనిచేస్తున్నాడు. ఈ పొడుపుకథని విప్పుతుంటే అది కలకత్తా అవుతుంది. వీలునిబట్టి ఏటా—ఒకటి రెండు సార్లు యింటికి వస్తుంటాడు. అతను వస్తున్నాడన్న ఆనందం యింటో వాళ్లకి ఎంతోసేపు నిలవదు. అతను జనంమనిషి. ఎప్పుడూ చుట్టూ పదిమందిని పెట్టుకు తిరిగితేకాని — తోచదు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ముఖ్యకేంద్రాల్లోనూ అతని స్నేహితులున్నారు. రామదాస్ మోటార్ ట్రాన్స్‌పోర్ట్ బ్రాంచిల్లాగా.

శెలవుమీద యింటికొచ్చిన అతన్ని యీ మిత్రప్రేమ యింట నిలవనియ్యదు. తన శెలవు సమయాన్ని మితులకూ యింట్లో వాళ్లకీ 2 : 1 నిష్పత్తిలో పంచుతాడు. శెలవు మొత్తం మూడింట రెండువంతులు సంచార కార్యక్రమానికే సరిపోయేది అతనికి.

ఇంట్లోవాళ్ళకి యిది కిట్టలేదు అనిప్పుడు అడ్డాల్లో బిడ్డడు కాడు కన్నా నయాన్నే చెప్పారు

ఫలితంగా రాము సంచార కార్యక్రమం రద్దయింది. దానిస్థానే మిత్రుల సమావేశ కార్యక్రమం రూపు దిద్దుకుంది. రామం శలవు వివరాలూ అతని కార్యక్రమం యిప్పుడు వాళ్ల నాన్నకన్న ముందు, వివిధ కేంద్రాలలో ఉన్న మిత్రబృందానికి ప్రసారంచేయబడతాయి. అతని శెలవు కార్యక్రమాన్నిబట్టి వాళ్ళ శెలవు మంజూరు చేయించుటకు తయారుగా ఉంటారు. టి ఎ, డి .ఎ. లు యిస్తాడో ఏమో మరి. కాస్త అటూ యిటూగా అతను శెలవులకు యింటికి చేరే సమయానికి వాళ్ళూ హాజరౌతారు. ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు

ఇది రామానికీ, వాళ్ళకీ పరస్పరం ఉన్న మైత్రికీ అనుబంధానికీ చిహ్నం అవునో కాదో చెప్పలేంగాని, యివాళ్టి రాధ ఒళ్ళు మంటకి మాత్రం ఖచ్చితంగా యిదే కారణం. ఇదివరకయితే కనీసం యింట్లో ఉన్న నాలుగు రోజులయినా యింట్లో వాళ్ళతో సరదాగా గడిపేవాడు. యిప్పుడూ సరదాకు కొదవేం లేదుగాని యిలా బయటివాళ్ళు నలుగురూ యింట చేరేసరికి బొత్తిగా ప్రయివసీ పోయిందనిపించింది.

వరండాలో రామం మరి నలుగురు స్నేహితులూ కలిసి గట్టిగా నవ్వుకుంటున్నారు. గంటన్నరనుంచీ చూస్తూంది రామం యింట్లోకి వస్తాడేమోనని. రాలేదు సరికదా రాధనే పిల్చాడు రెండుసార్లు ఒకసారి పంచతంత్రంలోని భాగాలు ఏవిటి? ఎవరు రచించారు? అని అడగటానికీ మరోసారి కొంచెం కాఫీ పెట్టిస్తావా? అంటూనూ.

అతని స్నేహితులంతా మంచి అభిరుచి కలవాళ్ళే. రామం కూడా చెల్లెలి యిమేజ్ ఎలివేట్ చెయ్యడానికి ప్రయత్నిస్తుంటాడు స్నేహితులముందు తన చెల్లెలు తెలివయినదీ—చురుకైనదీ అనుకోవడంలో అతనికి తగినంత తృప్తి ఉన్నట్టులేదు నలుగురి ముందూ వాటిని కాస్త కాస్త ప్రదర్శింపజేసి ఆనందించడం అతని హాబీ

మరోసారయితే యిందుకు రాధా ఆనందించేదే కాని యివాళ రాధకి అలాంటి ఆనందం ఏమీ కలగలేదు అన్నయ్య రేపు వెళ్ళిపోతాడు. మళ్ళీ చాలారోజుల దాకా రాడు.

# ఘటన

పైగా యీ ఉత్కంఠతను ఆపిల్ల భరించలేకుండా ఉంది. ఆమె ఎవరు? జేబులోకెందుకొచ్చింది? బొమ్మజేబులో కొచ్చిందంటే వ్యవహారం ఎందాకా వచ్చిందో ఊహించలేనంత అమాయకురాలు కాదు రాధ. తన పద్దెనిమిదేళ్ళ వయసుకు తగ్గ లోకజ్ఞానం ఆపిల్లకు లేకపోలేదు

మళ్ళీ యింకోసారి చూసింది. ఆ అమ్మాయి ఫొటోని పల్చటి కోలముఖం. ఆర్చిప్పల్లాంటి కళ్ళు. కోఘేరులాంటి ముక్కు.

## మశీదులో గణిత శాస్త్ర గ్రంథం

మకుస్ (ఎ. పి. ఎన్.) సోవియట్ మధ్య ఆసియా అటానమస్ రిపబ్లికు అయిన కరకల్పకియలోని ఒక మశీదులో ప్రాచీన భారతీయ గణిత శాస్త్ర గ్రంథం ఒకటి దొరికింది ఇది ఒక పార్శ్యగ్రంథం. ఈ గ్రంథానికి ఆ ఒక అనుబంధం కూడా వుంది. అందులో కొన్ని లెక్కలకు అన్వరు కొన్ని పద్యాలూ వున్నాయి. వాటి కింద అద్జి జియార్ అనే సంతకం కూడా వుంది.

ఈ ప్రాచీన వ్రాతప్రతిలో వున్న రెండు పద్యాలు పంధొమ్మిదవ శతాబ్దికి చెందిన కరకల్పక కవి అయిన అద్జి నియాద్ కొనిబయేవ్ వ్రాసినవేనని శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేశారు

బుల్లినోరు. చాలా బాగుంది. "ఆలోచన" రూపం దాల్చినట్టుంది.

అయితే అన్నయ్య ప్రేమలో పడ్డాడన్న మాట అన్నయ్యనుఅడిగితీరాలి. ఆ అమ్మాయి ఎవరో? కథేమిటో పొద్దుటి నుంచి చూస్తోంది. సమయం కుదరటంలేదు. సాయంత్రం రామం బయటకు వెళ్లడాన్కి బట్టలు వేసుకుంటూ రాధని పిల్చాడు "రాధా! కాస్త యీ గళ్ళచొక్కా ఆ తెల్ల స్లాకూ ఉలికిపెట్టవే" పురమాయించాడు.

"పెంట్లేమీ ఉతకక్కర్లేదుట్రా?"

"అక్కర్లేదు. అయినా చూడు. స్టాండు మీద మాసినవి ఏమయినా ఉన్నాయేమో. అద్దం ముందునుంచుని ముందుకీ వెనక్కీ నడుస్తూ చూసుకుంటున్నాడు. ఇన్‌షర్ట్ సరిగ్గా కుదిరిందో లేదోనని.

"ఇందాకా జేబులో పర్సున్న పేంట్ చూసానురా. బాగ మాసింది" జాగ్రత్తగా చూసింది రాధ. అన్నయ్య గతుక్కుమంటాడేమోనని. అతని మొహం కనిపించలేదు సరిగ్గా. షర్ట్‌కి వెనకాల వచ్చిన ముడతలు సర్దుకుంటున్నాడు రాము.

పర్స్ మాటెత్తితే మాట్లాడడేం? యీ మాటు డైరెక్ట్‌గానే అంది. "నీ జేబులో బొమ్మ చూసానురా! యిందాకా!"

రామం యీ మాటెటుతిరిగాడు. నవ్వుతో మొహం వెడల్పయింది.

"ఎలా ఉంది?" అడిగాడు.

"బానే ఉంది."

"బానే ఉందా? బ్రహ్మాండంగా లేదూ? నా మటుకు బ్రహ్మాండంగా ఉంది"

"ఎవరా అమ్మాయి?"

"సీత. తెలుసున్న వాళ్ళమ్మాయి."

"ఎవరు వాళ్ళూ?"

"అంటే ఏ ఇంట్లో అవా?" ఏ వూట్లో కాదు బెంగాలీస్. నీ కాస్టే వచ్చినట్టు లేదు. ఏం?'

"అది కాదురా, మనవాళ్లకిలాంటివి నచ్చవు. నీకూ తెలుసుగా" మెల్లగా అంది రాధ.

"అవును. నాకు తెలుసు. అయినా నాకు నచ్చింది" ధృఢం అన్నాడు రామం.

అంటే ఏమిటో రాధకర్థమయింది. అయితే వీడు పరిణామాలు ఆలోచించి మరీ నిర్ణయించుకున్నాడన్న మాట. రాధకి ఆ విషయమ్మై మరేం తరచ బుద్ధెయ్యలేదు. అందుకు అవకాశం కూడా దొరకలేదు. బయటినుంచిరామం ఫ్రెండ్ ఎవరో అరుస్తున్నాడు. "ఏరా! యింకా తెమల్లేదూ? కొంపదీసి యిప్పుడు మనం వెడుతున్నది పెళ్లి చూపులకు కాదుకదా?"

అతనికి తెలిసినట్టు లేదు. వీడింక పెళ్లి చూపులు చూడక్కర్లేదనీ. అసలు ఎవరికి మాత్రం తెలుసు? వీడు యిలాంటి నిర్ణయం తీసుకుంటాడనీ? ముందు ఆడపిల్లల పెళ్లిళ్లు అయిపోవాలి. తర్వాతే నాపెళ్లి. అని భీష్మించుకు కూచున్నాడు. అది చూసి—బాధ్యత తెలిసిన కుర్రాడు అని సంతోషిస్తున్నారు అందరూ. వయసు కూడా ఏమంత

## ఘ ట న

మించిపోలేదు కనుక ఎవరూ తొందరపడటం లేదు. విషయం యిదీ అని తెలిసినప్పుడు యీ సంతోషం ఏ విధంగా రూపాంతరం చెందుతుందీ? అని ఆలోచిస్తోంది రాధ.

అయినా రామం నిర్ణయంలోని నిజాయి తీని గుర్తించకపోలేదు రాధ. తన దారి తను చూసుకుని - మనసుకు నచ్చిన పిల్లను మను వాడితే వచ్చే పరిణామాలు వాడూ ఆలో చించే ఉంటాడు. తన చర్యల ప్రభావం చెల్లెళ్ల పెళ్లిళ్ల మీద పడకూడదనుకున్నా డన్నమాట. అందుకే చెల్లెళ్ల పెళ్లిళ్లే ముందు అంటున్నాడు. బాధ్యత లేకపోవడం ఏమిటి? తక్షణం తన ఆలోచన అమలు పరుస్తానంటే మాత్రం అడ్డేదెవరు? అన్నయ్యకు మంచి విచక్షణ ఉంది. అనుకుంది రాధ.

కాని రాధకి యీ వ్యవహారం సంతృప్తి కరంగాలేదు. అన్నయ్య ప్రేమించి — పెళ్లి చేసుకోడంలో ఆ పిల్లకి ఏ ఆక్షేపణా లేదు. కాని ఆ అమ్మాయి కనీసం మన భాషది కూడా కాదే? ఆవిడ రాకవల్ల కుటుంబంలో ఏ మాత్రం ఆనందం ఉంటుందో? అనిపిం చింది. కాని ఆ పిల్ల అన్నయ్య మనసుకు నచ్చిన పిల్ల. ఈ పెళ్లి జరగడంవల్ల కుటుంబంలో ఎంత మనస్తాపం ఏర్పడు తుందో — జరగకపోవడంవల్ల అన్నయ్య జీవితంలో అంతకన్న ఎక్కువ వెలితి ఏర్పడచ్చు. ఈ పెళ్లి జరిగితే కలిగేది కుటుంబంలో తాత్కాలికమయిన కలతలూ—మనస్తాపమూ. జరగకపోతే అన్న య్యకు శాశ్వతమయిన మనస్తాపం కల్గదూ? అది మిగిలిన వాళ్ళకి మాత్రం ఆనందమా? ఆలోచిస్తే ఎలాగనయినా ఈ పెళ్లి జరగడమే మంచిదనిపించింది. రాధకి.

అప్పుడు రాధ ప్రేమతత్వం — దాని వైఫ ల్యానికి పరిణామాలూ మరికొంచం ప్రాక్టి— కల్ గా ఆలోచించి ఉండవలసింది, కాని, రాధకి అప్పుడు తెలుసున్న ప్రేమికులు దేవదాసు— మజ్నూల వంటి వారే. మామూలు సుబ్బా రావులూ రామారావులూ కాదు. అందుకే వాళ్లన్నయ్యను భగ్నప్రేమికుడిగా ఊహించుకో లేకపోయింది. ఆ ఫొటో సంగతి యింట్లో ఎవరికీ చెప్పలేదు.

* * *

అదీ బెంగాలీ అమ్మాయి కథ. ఇప్పుడు రాధకి సమస్య వచ్చిపడింది. రాజ్యం విషయం అన్నయ్యదాకా వస్తే బెంగాలీ పిల్ల విషయం బయటికి రావడానికి యిది సమయం కాదు.

తనకు తెలుసు. నాన్న బెంగాలీ పిల్లను చేసుకుంటానంటే చచ్చినా ఒప్పుకోరు. ఆయన సాంప్రదాయవాదం పట్టుదలా తానెరగనిది కాదు అలాగే అన్నయ్యనూ. రక్తంతోపాటుగా నాన్నగారి పౌరుషం, పట్టుదల కూడా వాడికి వంటబడా యి.

అసలు అన్నయ్య యిప్పట్లో ఈ విషయం బయట పెట్టదలుచుకోలేదు ఇప్పుడు వచ్చిన యీ సంబంధంవల్ల ఆ సంగతి బయటికివస్తే అన్నయ్య నిరీక్షణకూ విచక్షణకూ ప్రయో జనంఉండదు. ఇప్పటినుంచీ యింట్లో కలతలు ప్రారంభమౌతాయి ఎలాగయినా సరే యీ విపత్కర పరిస్థితుల నుండి కుటుం బాన్ని కాపాడాలి.

నిజానికి యీ పరిస్థితి ఎప్పుడో ఒకప్పుడు ఏర్పడక తప్పదు కాని— యిప్పుడే యింకా ఒక్క ఆడపిల్ల కయినా పెళ్లికాకుండానే — యింత తొందరగా యీ విషయం బయట పడటంవల్ల ఎవరికీ ఎటువంటి ప్రయోజనం లేకపోగా యింట్లో అనవసరంగా గొడవలు మొదలవుతాయి ఏం చెయ్యాలి? ఆలోచి స్తున్న రాధ ఆకాశంకేసి చూసింది. ఆకాశం ఆలోచన చెప్పింది రాధ ఆచరణలో పెట్టింది.

* * *

శాస్త్రిగారమ్మాయి పెళ్ళివార్త విన్న యింటిల్లిపాదీ — నిశ్చేష్టులయ్యారు. అంత మర్యాదస్తుడయిన పెద్దమనిషి మంచీ — మర్యాదా లేకుండా ఆడిన మాటకు కట్టుబడ కుండా యింకో సంబంధం చూసుకుని కూతురికి పెళ్లిచేస్తున్నాడంటే నమ్మలేక పోయారు ముందు.

శాస్త్రిగారు చేసిన పని గొప్ప అవమా నంగా తోచింది. ఎందుకిలా చేసినట్టు? ఎదుటపడి నాలుగూ అడిగి కడిగేసి యింత గడ్డెట్టాలనుకున్నారు. దీనంతేదో తేల్చుకోవా లనుకున్నారు సుబ్రహ్మణ్యంగారు. అలాచెయ్య డానికి అహం అడ్డొచ్చింది. మాట్లాడ కూరుకున్నారు. నయమే యిద్దరూ కలెక్టరు గారు తమకు కూతుర్నియ్యొచ్చాడన్న విషయానికి తగినంత ప్రచారం జరగలేదు' అని సరిపెట్టుకున్నారు. రామానికి మాత్రం యీ విషయం తెలియకూడదని తగినంత కట్టుదిట్టంకూడా చేశారు.

# 286
# 165
# 135
# 65

ఇవి మాయాజాలపు సంఖ్యలు కావు — కెల్వినేటర్ సంఖ్యలు. దాని పరిమాణాన్ని లీటర్లలో తెలిపే సంఖ్యలివి. అంటే-ఒక కుటుంబంలో ఎందరు సభ్యులున్నా సరే — వారికి సరిగ్గా సరిపడే పరిమాణంలో ఒక కెల్వినేటర్ వుందన్న మాట. కెల్వినేటర్లు ఆ కుటుంబాలకి సంతోషాన్నివ్వడానికిగల కారణాలలో ఇదొకటి మాత్రమే.

## చిన్నదైనా, పెద్దదైనా ఒక కుటుంబానికి సంతోషాన్నిచ్చే సంఖ్యలివి.

అన్నిటికంటే — కెల్వినేటర్ స్వంతదారులు సంతోషపడడానికి మంచి కారణం వుంది — ఏమంటే ఒక్కసారి కొంటే వారికి రెండు విధాల లాభం కలుగుతుంది. ప్రతి కెల్వినేటర్‌తోను స్పెన్సర్స్ వారి విశిష్టమైన సేవా సౌకర్యం కల్పిస్తామన్న హామీ కూడా లభిస్తుంది. యావత్ భారత దేశమంతటా శాఖోపశాఖలుగల స్పెన్సర్స్‌వారు తాము విక్రయిస్తున్న రెఫ్రిజిరేటర్ అమ్మకానంతరం త్వరితమైన, శ్రేష్ఠమైన మరియు సాదరపూర్వకమైన సేవా సౌకర్యాలిస్తామని హామీ యిస్తున్నారు ఆ హామీ — కొనుగోలు చేసిన తర్వాత మిమ్మల్ని మేము మరచిపోలేదన దానికి ప్రత్యక్షనిదర్శనం — ఇదే కెల్వినేటర్ గురించి అధిక సంతోషాన్నిచ్చే విషయం

కెల్వినేటర్‌లో వున్న ఇతర ఆకర్షణలు:

- అధిక వినియోగానికి అనువుగా స్థలం నమూనా చేయబడింది.
- ఒకే మూసలో వున్నట్టి అంచులు
- అయస్కాంత శక్తిగల తలుపు గాస్కెట్
- పోలార్ స్ప్రయర్ కంప్రెషర్
- నాజూకైన స్లిమ్ లైనర్ డిజైను.

**స్పెన్సర్స్**

1865 నుండి సేవ చేయడమే మా ధ్యేయం.

**స్పెన్సర్ అండ్ కంపెనీ లిమిటెడ్.,**

153, మౌంట్‌రోడ్, మద్రాసు-600 002
19-A, అలిపూర్ రోడ్, ఢిల్లీ -110 006
స్పెన్సర్స్ బిల్డింగ్, ఫోర్జెట్ వీధి, బొంబాయి-400 036
డైమండ్ హార్బర్ రోడ్, కిడ్డర్‌పూర్, కలకత్తా-700 023






Focus SC 659 Tel (a)

పీర్పు ఎన్నికచేసినది-ప్రతిసారీ! అదే స్పెన్సర్స్‌వారి కెల్వినేటర్‌లో ప్రత్యేకత.

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

**హిందీ స్వరూపంపై సంగోష్ఠి :**

ఏ భాషయినా అధికార భాష కావాలంటే అది చెల్లవలసిన ప్రాంతంలోని వివిధ భాషా సంప్రదాయాలను, సంస్కృతిని, పదాలను కూడ సొంతం చేసుకోవలసి ఉంటుంది. హిందీ, సంపర్క భాషగా ప్రకటితమయి మూడు దశాబ్దాలు కానున్నా దేశంలో పాతుకు పోకపోవడానికి కారణం ఏదైనా, అది పాతుకుపోలేదు. అధికార భాషా కమిషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అన్నట్టు స్వాతంత్ర్యం ప్రకటించిన నాడే హిందీ లింక్ భాషగా ఉంటుందని నెహ్రూ ప్రకటించి ఉంటే ఇప్పటి సమస్యల ప్రాదుర్భావమే ఉండేది కాదు. జూన్ 27, 28, 29 తేదీలలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర శాఖవారు ఖైరతాబాద్‌లోని తమ కార్యాలయములో సంగోష్ఠి ఏర్పాటు చేశారు. రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఎం. వి. రాజగోపాల్ సంగోష్ఠికి అధ్యక్షత వహించగా, విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకటకృష్ణారావు ప్రారంభించారు. మొదటినాటి ఉదయం గోష్ఠికి శ్రీ టి. హయగ్రీవాచారి అధ్యక్షత వహించగా, ఆంధ్రప్రదేశ్ స్కూళ్లలో ద్వితీయ భాషగా హిందీ బోధనం, కార్యక్రమం, పాఠ్య పుస్తకాలు అనే విషయం, ఆనాటి సాయంకాలం గోష్ఠిలో విద్యాశాఖ డైరెక్టరు శ్రీ వి. రామచంద్రన్ అధ్యక్షతన హిందీ పండితుల ప్రశిక్షణ కోర్సు, 28 ఉదయం శాసనసభ ప్రతిపక్ష నాయకుడు శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ అధ్యక్షతన జరిగిన గోష్ఠిలో హిందీ పండితులసమస్యలు, ఆనాటి సాయంకాలం మాజీ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ గోపాల్ రావ్ ఎక్బోటే అధ్యక్షతన జరిగిన గోష్ఠిలో రాజ భాషగా హిందీ స్వరూపం అన్న విషయాలు చర్చించబడ్డాయి. చర్చలలో రాష్ట్రం లోని వివిధ ప్రాంతాలనుండి ఇతర రాష్ట్రాల నుండి ప్రత్యేకాహూతులుగా వచ్చిన 90 మంది విద్వాంసులు పాల్గొన్నారు. ఈ విషయంలో ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవాలని కోరుతూ చేసిన తీర్మానాలను ఆమోదించడానికి 29 న జరిగిన సమావేశానికి శ్రీ వి. పి. రాఘవాచార్యులు అధ్యక్షత వహించారు. సమావర్తన (ముగింపు) సమావేశంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, ఈ సంగోష్ఠి చేసిన సూచనలను ప్రభుత్వ ప్రతినిధులు, హిందీ సంస్థల ప్రతినిధులూ గల సమన్వయ సంఘం పరిశీలించి తగు నిర్ణయాలు చేస్తుందని "మన రాజ్యాంగంలో నిర్దేశించిన ప్రకారం హిందీ భాషా స్వరూపం ఉండి తీరవలసిందే ఇందులో ఎట్టి అరమరికలూ ఎవ్వరికీ ఉండకూడదు" అన్నారు.

. స్వాతంత్ర్యోద్యమంతో పాటు వికసించి, గాంధిజీ వంటి నాయకుల అండన అభివృద్ధి పొందిన ప్రస్తుతం శ్రీ వేమూరి ఆంజనేయశర్మ, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి, శ్రీ ఎం. వి. పాపన్నగుప్త, శ్రీ వి. వి. రాఘవాచార్యులు వంటి కార్యదీక్షితుల అకుంఠిత సేవతో ఏటా 50 వేల మందిని పరీక్షలకు పంపుతూ, ప్రాంతీయ సాహిత్యాలను హిందీవారికి ఆమెతలిస్తున్న దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర శాఖ కార్యక్రమం వివరిస్తూ ఆంధ్రశాఖ అధ్యక్షులు శ్రీ ఎం. వి. పాపన్న గుప్త చెప్పిన స్వాగత వచనాలతో, కార్యదర్శి శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి ధన్యవాదాలతో సంగోష్ఠి సమాప్తమయింది. ఈ సంగోష్ఠి ప్రత్యేకత హిందీ ప్రచారసభ భవనాల తాపీమేస్త్రీ శ్రీ సుబ్బారావును సన్మానించడం. ఈ వూహ తోచినందుకే సభవారిని అభినందించాలి.

**శ్రీ అబ్దుస్సలామ్‌ఖాన్ వ్యాసం :**

రాష్ట్ర ప్రభుత్వం మాజీ పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ శ్రీ అబ్దుస్సలామ్‌ఖాన్ "పోలీస్ జర్నల్"లో వ్రాసిన ఒక వ్యాసం 1973లో ఉత్తమ వ్యాసంగా పరిగణితమై హోం శాఖ బహుమానం పొందింది. ఈవ్యాసం 1973 జనవరిలో "ఇండియన్ పోలీస్ జర్నల్"లో ప్రచురితమయింది. పేరు "ది మిస్టీరియస్ డబుల్ మర్డర్ కేస్ ఆఫ్ సికిందరాబాద్" దీనిని ఈయన పోలీసు కమిషనర్ గా ఉన్నప్పుడు వ్రాశారు.

**ఉపశ్రుతి :**

"నరత్వం అన్విష్యతి స్పృశ్యతేహి తత్" అనే సూక్తి శాకుంతలంలో లేదని మీరు వ్రాసి పరీక్షకులపై అభాండం వేశారే? న్యాయమా? అని చౌకాంబా ఎడిషన్‌లో ఉందే!" అన్నారు నాతో ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ తాత్కాలికాధ్యక్షులు డాక్టర్ మోద్‌గణేశ్ లాల్కే.

"నిజమే సార్. ప్రాచీన గ్రంథాల భాగాలు, పాఠ్యంగా నిర్ణయించేటప్పుడు విస్తృత ప్రతుల లోనివి గ్రహించాలి గాని, ఏక దేశంగా ఉన్నవాటి నుంచి గ్రహించరాదని మతం. ఇరవయి ప్రతులలో కనిపించక, ఒక ప్రతిలో ఉంటే చాలునా?" అని తప్పుకున్నాను.

---

అయినా యింట్లో వాళ్లందరికీ ఓ అనుమానం పీకుతూంది. కిట్టనివాళ్లు ఎవరయినా ఏమయినా చేసారేమోనని లేకపోతే ఆవాళంత అప్యాయంగా మాట్లాడిన మనిషి యిలా ఎందుకు చేస్తారూ? అని. శాస్త్రిగారిని కూడా గట్టిగా ఏం అనుకోలేక పోయారు అప్పుడనుకుంది రాధ, యింటి దొంగని యీశ్వరుడయినా పట్టలేడన్నది నిజమేననీ.

రాజ్యం సంబంధం తప్పిపోయిన వివారాన్ని రాధకు సంబంధం కుదిరిన సంతోషం మింగేసింది. ఇంట్లో అందరూ చాలా హడావుడిగా వున్నారు. రామంకూడా నెలరోజులు శెలవు పెట్టేసి వచ్చాడు అంత సంతోషంలోనూ రామం ఓ రోజునన్నాడు "అమ్మా రాధెళ్ళిపోతే ఏం తోస్తుందే యింక యింటికొస్తేనూ?" అని.

## ఘటన

అప్పుడనుకుంది రాధ. నిత్య జీవితంలో అన్నా చెల్లెళ్ళు అనుబంధం యిలాటి చిన్న మాటల్లోనే ప్రకటితమౌతుంది. దీన్ని ప్రకటించడానికి "బంగారుతల్లీ! నా చెల్లెలు" అని పాడనే అక్కర్లేదు. ఈచిన్న మాటల్లోనే అంత అర్థమూ - అంతకన్న మించినదీ ఉంది, అని. అలా అనుకుంటూంటే ఆ పిల్లకు కళ్ళు చెమ్మగిల్లాయి.

రాధ భర్త ఆనందరావు రామానికి బాగా నచ్చాడు. మనిషిలాగే యితని అభిరుచులూ అందమయినవే అనుకున్నాడు. దేవకీ—వసుదేవులను వెంటేసుకు ఊరేగిన కంసుడిలా తిరిగాడు రామం వాళ్ళిద్దరినీ వెంటేసుకుని. అలాటి సమయంలోనే తెలిసిందట కంసుడికి. తన మరణ కారకుడు వాళ్ళవల్లే పుట్ట బోతున్నాడనీ. ఇక్కడకూడా అలాటిదే ఒకటి జరిగింది. అంత ప్రమాదకరమైనది కాదు. కాగా తెలిసింది రామానికీ కాదు.

రాధకూడా కృష్ణార్జునుల్లా కలిసిపోయిన బావమరదులను చూసి ఆనందించింది. ముగ్గురూ కలిసి వెడుతున్నా, ఒక్కొక్కసారి వాళ్లు రాధ ఉనికిని కూడా విస్మరిస్తున్నారు. ఇందుకు రాధేం బాధపడ లేదు రాధ బాధ పడిందల్లా రామం నీత ఫొటో ఆనందరావుకి చూపించినప్పుడే. అదికూడా రామానికి బావగారి దగ్గిర దాపరికం లేనందుకు కాదు. అది ఒక మందు తాలూకు ఎడ్వర్‌టైజ్‌మెంట్ ఫొటో అయినందుకు. దాని తాలూకు మెడికల్ జర్నల్ తనెన్నడూ చూడనందుకు. ఆఖరికి అన్నయ్య తనతో అనవసరంగా వేళాకోళం ఆడినందుకు.

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

**ఈ క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!**

shilpi hpma 6*/73 TFL

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**జి. ఎస్. పుత్తూరు.**

గాంధి పుట్టిన దేశంలో అణ్వస్త్రాల తయారీ పై మీ అభిప్రాయం.

కార్నర్ చేస్తే పిల్లి పులి అవుతుందన్న సత్యాన్ని తెలియచేయడం అవసరం. గాంధి బతికేవుంటే యీ జాతినింకా ఎంత నిర్వీర్యం చేసేవాడో— అహింస— శాంతి అంటూ. వద్దు. ఎన్నాళ్లు— క్షణం క్షణం చస్తూ అందరికీ తలాడిస్తూ బతకడం?! శాంతి కాముకులకి కూడా ఆత్మరక్షణా పద్ధతులు తెలియాలి.

**పి. ఎస్. జి. వాల్తేరు.**

అనేకమంది జీవితాలను తరచి చూసి నేనొక అభిప్రాయానికి వచ్చాను. అదేమిటంటే— ఏ కొద్ది మందో తప్ప స్త్రీలంతా నీచపు అభిప్రాయాలుకల్గి ఇరుకు మనస్తత్వం కలవారు. ఉదాహరణకి పాపపని చేసే మనిషి మీద సానుభూతి ప్రదర్శించినా అక్రమ సంబంధం అంటకడతారు?

మీ అనుభవైక సారం మీరు చెప్పుంటే— నాకొక చస్తానా గోపాల్‌గారూ కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. మగవాళ్లు యింటి పనిలో జోక్యం చేసుకోవడం వల్ల కొన్ని యిబ్బందులున్నాయి.

పొద్దుటే లేచి వండుం పుల్ల నములుతూ 'లక్ష్మీ నిన్నేం చేసేవే?' అంటూ చొల్లు కబుర్లకి దిగే భర్తమీద భార్యకి గౌరవం ఎలా వుంటుంది.

**పి.ఆర్.జి - నేరెళ్ల**

సర్వ జగతిని సృష్టించిన భగవంతునికి నానాటికి విలువ లేకుండా పోతూంది కారణం?

మనిషి— సర్వానికీ తనే కారణం అన్న గర్వం పెంచుకోవడం చేత.

**ఎ. ఎస్. ఖమ్మం**

మీ సమాధానాలు చదివి మీ గురించి చాలా స్టడీ చేశాను. మీ ఆడవాళ్లు హక్కులు, స్వాతంత్ర్యం అంటూ హాహాకారాలు చేస్తారే కాని తమ బాధ్యతలను గుర్తించరేం? బాధ్యతలు గుర్తించని వాళ్లకి హక్కులివ్వడం కూడా వ్యర్థమే.

నేననేదీ అదే బాబూ, బాధ్యతలు గుర్తించని వారికే అన్ని హక్కులూ యిచ్చేసి వ్యర్థం చేస్తున్నారు— మాకూ బాధ్యతలు మోసే గాడిద పనే కాకుండా—మనిషికి ఉండే కాసిన్ని హక్కులు కూడా యివ్వరేం అని.

**బి. పి. ఎస్. విజయవాడ**

సినిమా రచయిత్రి కావాలంటే?

ఏముంది! రచయిత్రివేనా అవాలి. లేదా ఏ దర్శకుని భార్యైనా, నిర్మాత భార్యైనా కావాలి!

# దోమలు జీవితాన్ని దుర్భరం చేస్తాయి





అత్యధికంగా అమ్ముడవుతున్న దోమల నివారిణి

## మీకు కావాలి
# ఓడోమాస్




లక్షలాది ప్రజలు నమ్మకంతో వాడేది ● పసిపాపలకు కూడా నిరపాయకరమైనది

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు
BALSARA

CHAITRA BLS

# ప్రశ్నావళి

ఎం. జె. ఎ. వనపర్తి

మీ జవాబులు అద్దంమీది మసకలా ఉంటున్నాయి. చాలా ఘోరమైన జవాబులు ఇస్తున్నారు. దేహంపై సూదితో గుచ్చుకొన్నా అంత బాధ అనిపించదు గాని, మీ జవాబులు చదువుతుంటే అంతకంటే ఎక్కువ బాధే అనిపిస్తుంది. మీ జవాబులు ఆవేశాన్ని తప్ప శాంతిని చేకూర్చడంలేదు.

చిత్తం. శాంతి ఏ బాబాగారి దగ్గరేనా లభిస్తుంది. శాంతి మత్తు మందు లాంటిది. ఆలోచనలని స్తంభింపజేసే శాంతి కాదు—మనకిప్పుడు కావలసింది. సూది పోట్లులా బాధ పెట్టి ఆలోచింపజేయాలి. అదీ ముఖ్యం—లేకపోతే. మీరెప్పుడూ వేదకాలంనాటి స్త్రీ ఎంత గొప్పదో, మీ తాతలు తాగిన నేతులి నాటికీ ఎలా ఘాటుగా ఉన్నాయో చెప్పుకుంటూ గర్వపడతారేగాని, ప్రస్తుతం స్త్రీ లెలా ఉన్నారు — మీతోపాటు — కాలంతోపాటు పరిస్థితుల ప్రభావానికి లోనై — మారిన యీ తరం స్త్రీని గురించి ఆలోచించనే ఆలోచించరు. అవకాశం ఇస్తే— అప్పటికీ — యిప్పటికీ— ఎప్పటికీ ఆడదాన్ని వంటింటి గడప— లక్ష్మణ రేఖగా చేసి నిలవేస్తాడు — స్వార్థ జీవి అయిన పురుషుడు! ●

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

## శ్రోత్రియుండంటే * ధర్మపథం

—బులుసు వేంకట రమణయ్య

పూర్వం రాజులు ఆ యా ప్రత్యుల వారికీ, పేరులకూ, విద్వాంసులకూ ఈనాములు, ముఖాసాలు, శ్రోత్రియాలు చ్చేవారు. వీటిలో చాలాభాగం పన్ను చెల్లింప నక్కర్లేని భూములు. కొన్ని స్వల్పంగా పన్ను చెల్లించవలసినవి. వీనితో శ్రోత్రియాలు విద్వాంసులగు బ్రాహ్మణులకు ఇయ్యబడేవి. శ్రోత్రియందారులు నిర్విచారంగా కాలం గడిపేవారు. శ్రోత్రియందారు కావడం ఆ కాలంలో గొప్ప గౌరవ సూచకం.

శ్రోత్రియందారనే పేరు వింటున్నామే కాని, ఆ పేరు ఎందుకు వచ్చినదో చాల మందికి తెలియనే తెలియదు.

శ్రోత్రియుడనగా ఎటువంటివాడో ఈ శ్లోకంవల్ల గ్రహించవచ్చు —

'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః
సంస్కారైః ద్విజ ఉచ్యతే,
విద్యయా యాతి విప్రత్వం
త్రిభిః శ్రోత్రియ ఉచ్యతే.'

బ్రాహ్మణవంశంలో పుట్టినవానికి పుట్టుక తోనే బ్రాహ్మణత్వం లభిస్తుంది. అప్పు డతనిని బ్రాహ్మణుడని పిలవవచ్చును. చౌలం, ఉపనయనం మున్నగు సంస్కారములవల్ల ద్విజత్వం లభిస్తుంది. ద్విజుడంటే రెండు జన్మలు కలవాడన్నమాట. అంటే-పుట్టుక ఒక జన్మ. ఉపనయనం రెండవ జన్మ. అందు వల్ల ఉపనయనం అయిన తర్వాతనే అతనికి ద్విజుడనని చెప్పుకొనే హక్కు ఉన్నది.

బ్రాహ్మణునికి విప్రుడనే పేరు కూడా ఉన్నది. అందరూ విప్రులని చెప్పడానికి వీలులేదు. విద్వాంసు డైనప్పుడే అతణ్ణి విప్రుడని చెప్పవలసి ఉంటుంది.

ఇక శ్రోత్రియుడని చెప్పడానికి పయి గుణత్రయమూ ఉండాలి. అతడు బ్రాహ్మణుడై పుట్టాలి. ఉపనయనాది సంస్కారాలను పొంది ఉండాలి. మంచి విద్వాంసుడును అయి ఉండాలి. ఈ అన్నీ ఉన్నవాడే శ్రోత్రియుడు కాగలడు.

ఇట్టి శ్రోత్రియులు ఏ ప్రాంతంలో వుంటే, ఆ ప్రాంతాన్ని పాలించే ప్రభువులు వారి నాదరించి, వారి జీవికకు భూవసతులను కల్పించేవారు. అట్టివే శ్రోత్రియాలని ప్రసిద్ధి పొందాయి. అట్టి శ్రోత్రియులు రాజసేవలో ఉండనక్కరలేదు. స్వేచ్ఛగానే ఉండవచ్చును.

ఇప్పుడు ఆ యా ప్రభుత్వాలు కొందరు కళాకారులకూ, విద్వాంసులకూ, కవులకూ ఇస్తున్న భరణాలవంటివే అప్పటి శ్రోత్రియాలు.

# కల్తీ సిమెంట్ కనుగొనుట కష్టం...

కాని కె.సి.పి సిమెంట్‌తో కాదు. దానియొక్క లేతరంగు కల్తీ సాధ్యపడనివ్వదు. ఒకవేళ చేసిన కనుగొనుట సులభం. కనుక మీ ఊహాసౌధాలకు ప్రథమ స్థానం కె.సి.పి. సిమెంట్‌దే.

**అత్యధిక శక్తి**

శాశ్వతమైన స్థిరత్వానికీ, దృఢత్వానికీ.

**బీటల నిరోధి —**
బీటలు కనీసం వెంట్రుకవాసి కూడా ఏర్పడవు. కట్టడములోను, ప్లాస్టరింగులోను కూడా.



**కమనీయత —**
చక్కని మెరుపుతో, నునుపుతో కన్నుల పండువుగా నుండటం కె.సి.పి. సిమెంట్‌కు సహజం. ఈ సారి మీ అవసరాలకు మా సిమెంట్ వాడి చూడండి.

## కె.సి.పి. సిమెంట్‌తో కల్తీ చేయడం సాధ్యంకాదు.

తయారుచేయువారు:

**ది రామకృష్ణ సిమెంట్స్ — మాచెర్ల**

**ది కె.సి.పి.లిమిటెడ్.** సిమెంట్ సేల్సు డివిజన్
38, మౌంట్ రోడ్, మద్రాసు-6.




SISTA'S.KCP.1/74 TE

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA




ముత్యాలముగ్గు

ఈస్ట్మన్ కలర్

కథ,మాటలు. ముళ్ళపూడి వెంకటరమణ

సంగీతం కె.వి.మహదేవన్. కెమెరా. ఇషాన్ ఆర్య

నిర్మాత ఎమ్వీయల్

దర్శకుడు

బాపు

ALBANA

ANNAPURNA



అన్నపూర్ణవిడుదల